మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

అక్టోబర్ - డిసెంబర్ 2015

CI




విజయవాడలో బహిరంగ సభ




దార్శనికుడు గురజాడ పుస్తకావిష్కరణ - అనంతపురం




విజయవాడలో ఐక్యవేదిక ఏర్పాటు




కడపలో జరిగిన శత వర్ధంతి సభ




నెల్లూరు




తూర్పుగోదావరి




విద్యార్థుల ర్యాలీ - తూర్పుగోదావరి




విద్యార్థుల ర్యాలీ - ప్రకాశం

సంపాదకీయం

చైతన్య మానవి

# సామాజిక విప్లవ మూర్తులు

సామాజిక ప్రజాస్వామ్యం లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యం మనజాలదన్నారు డా॥ బి.ఆర్.అంబేద్కర్. ఒక మనిషికి ఒక ఓటు ఇచ్చి రాజకీయంగా సమాన విలువను కల్పించిన రాజ్యాంగం నిలబడాలంటే ఆర్థికంగా, సామాజికంగా స్త్రీలు, దళితులు సమాన స్థాయి పొందాలన్నారు. అప్పుడే ప్రజాస్వామ్య విలువల పరిమళాలను ఆస్వాదించవచ్చని సమానత్వం కోసం జీవితకాలం కృషి చేసిన డా॥ అంబేద్కర్ 125వ జయంతి జాతి యావత్తూ ఘనంగా జరుపుకోనున్న వేళయిది. మరో ఆణిముత్యం నవయుగ వైతాళికుడు గురజాడ అడుగుజాడల ఆనవాలు వెతుక్కుని ముందడుగు వేసే ప్రయత్నంలో శతవర్ధంతి రాష్ట్రవ్యాపితంగా, ఘనంగా జరిగింది.

మొదటి మహిళా ఉపాధ్యాయనిగా ఛీత్కారాలనధిగమించి, సాంప్రదాయాలను ఛేదించి, కుల మతాలకు అతీతంగా మహిళల, పిల్లల అభివృద్ధికి అంకితమై జీవించిన సావిత్రీబాయి పూలే జయంతి జనవరి 3న జరుగనున్నది.

సాంప్రదాయపు మూఢవిశ్వాసాల మీద తిరుగుబాటు జెండాను ఎగురవేసిన ఈ సామాజిక విప్లవకారులు భావికి బాటలు వేశారు. పశువులతో, బానిసలతో సమానంగా చూడబడిన స్త్రీలు విముక్తి చెందకుండా సామాజిక పురోగమనం అసాధ్యమన్న సత్యాన్ని గ్రహించిన వీరు అందుకు కారణమైన హిందూ ధర్మాన్ని ధిక్కరించమన్నారు.

విజ్ఞానం, సమాచారం, వనరులు పొందడం, స్వతంత్ర ఆలోచనలు, అభిప్రాయాలు రూపొందడం, ఆర్థిక వ్యవహారాలను నిర్వహించగలగడం, ఇంటిలోనూ, సమాజంలోనూ నిర్ణయాలు చెయ్యగలగడం ద్వారా స్త్రీలు సాధికారులుగా సంపూర్ణ వ్యక్తులుగా రూపొందుతారని అంబేద్కర్ ఆధారాలతో పేర్కొన్నాడు. రాజ్యాంగంలో ఆర్టికల్ 14 అందరికీ సమాన హక్కులున్నాయని పేర్కొంటే ఆర్టికల్ 15 సెక్స్ కారణంగా స్త్రీలైనందుకు వివక్షకు గురి కాకూడదని పేర్కొన్నారు. సమానత్వ సాధనకోసం వ్యవస్థలో సానుకూల చర్యలు చేపట్టాలని స్పష్టంగా పొందుపర్చడం జరిగింది.

విద్య నేర్పిన స్త్రీరత్నమే... అంటూ గురజాడ స్త్రీల విద్య అత్యంత అవసరమని పేర్కొనటమేగాక ఆడదానికైనా మగవాడికైనా ఒక నీతి ఉండాలని మధురవాణి చేత హితబోధ చేయించారు. తెలివితేటలు, ఆలోచనలు మగవారి సొత్తు మాత్రమే కాదని తన రచనల ద్వారా చాటి చెప్పారు. ఇంటిపనితో శక్తి సామర్థ్యాలు హరించుకు పోతున్న స్థితి మారాలన్నాడు. కన్యక ద్వారా అపరిమితాధికారాలున్న రాజునైనా స్త్రీలు సవాల్ చేయగలరని రుజువుపర్చారు. మగమహారాజన్న భావనలను దునుమాడారు. వేశ్యావృత్తి పాపం సమాజానిదేనని కుండబద్దలు కొట్టారు.

ఉన్నత స్థానంలో ఉన్న మహిళ అధఃపాతాళానికి నెట్టబడి బాల్యంలోనే వితంతువులుగా మార్చబడి బలవంతపు చాకిరీకి, లైంగిక అత్యాచారాలకు, అవాంఛనీయ మాతృత్వానికి చిహ్నాలుగా మార్చబడిన ఆనాటి బాల వితంతువుల బిడ్డలను అక్కున చేర్చుకున్నది సావిత్రిబాయి పూలే. బలవన్మరణాలను ఆపింది. నేటికీ శీలంచెడిన ఆడదని స్త్రీల తప్పులేకపోయినా అత్యాచార బాధితులను అక్కున చేర్చుకోలేని దౌర్బల్య సమాజంలో ఉన్నాం. 150 ఏళ్ళ క్రితమే చెడగొట్టబడిన వితంతువులను అక్కున చేర్చుకున్న అమృతమూర్తి సావిత్రీబాయి. అంటరానితనాన్ని తప్పని చెప్పడమే కాక తన ఇంటినే ఆవాసంగా మార్చిన సాంఘిక విప్లవకారిణి. ప్లేగువ్యాధిగ్రస్తుల దగ్గరకు వెళ్ళడానికే వెనుకాడే స్థితిలో ప్రాణాలు పోవచ్చని తెలిసికూడా వారికి సేవలందించిన స్నేహమయి.

సామాజిక సంఘర్షణలో దార్శనికులుగా మహిళల హక్కుల కోసం పోరాడిన డా॥బి.ఆర్. అంబేద్కర్, గురజాడ, సావిత్రీబాయి పూలేలను స్మరించుకోవడం అంటే వారి ఆలోచనలను స్మరించుకోవడం, వారిబాటలో పయనించే దానికి సిద్ధమవడం. స్త్రీల అణచివేతకు కారణమైన మనుధర్మ శాస్త్రం లాంటి అధర్మ మత గ్రంధాలు ఆ పేరిట సాగిన సాగుతున్న దుస్సాంప్రదాయాలు నూతనంగా కొత్త రూపాలలో సాగుతున్న వేళ ఇది. అంతరిక్షాన్ని అధిరోహిస్తున్న మహిళలను పక్కన కూర్చోడానికే తగరని, జాతి కొనసాగింపుకు మూలమైన ఋతుక్రమమే అపవిత్రమనే వెర్రి జాడ్యాలను పట్టుకుని వేళ్ళాడేవారి రాజ్యం నడుస్తున్న కాలం ఇది. వ్యాపారం, సాంప్రదాయం కలిసి దాడి చేస్తున్న వేళ తమ జీవితాలలో నిరంతర సామాజిక ఘర్షణే శ్వాసగా చేసుకున్న మహనీయులను దీపధారులుగా స్వీకరించి వెలుగులోకి ప్రయాణం సాగిద్దాం. ఆధునిక మహిళకు అర్థవంతమైన వారసులమని చాటుదాం. వారికి జోహార్లర్పిద్దాం. ◆

సూక్తి: ఎదుటివారు నీ మాటలను శంకించినా నీ పనిని చూసి నమ్ముతారు. పనికి ఉన్న విలువ అది.

# చైతన్య మానవి

## ఈ సంచికలో


| | |
|---|---|
| వ్యాసం | శిక్షా - విముక్తా? ............ 3 |
| మణిపూసలు | సావిత్రీబాయి పూలే ............ 6 |
| కథ | మోనికా యు ఇడియట్............ 9 |
| సామాజికాంశం | శివసేన దుశ్చర్య ............13 |
| | మహిళల పౌష్టికత............15 |
| సీరియల్ | మరో అమ్మ............18 |
| రిపోర్టు | మద్యం మహమ్మారి ............22 |
| నివాళి | నాగిరెడ్డి అనసూయ............ 24 |
| ఆరోగ్యం | రక్తహీనత............ 25 |
| పుస్తక సమీక్ష | ఒక హిజ్రా కథ............28 |
| | గురజాడ స్ఫూర్తితో............ 30 |
| నివాళి | తిప్పాని లక్ష్మి............32 |
| హింస | పోలీసుల కీచక పర్వం............ 33 |
| కథ | అంతిమం............34 |
| చట్టాలు | పిసిపియన్‌డిటి యాక్ట్............ 38 |
| కేస్‌స్టడీ | అతకని మనసులు............ 40 |
| మీడియా | కంచె ............ 42 |
| వైద్యం | స్త్రీలలో నడుము నొప్పి............ 44 |
| | ఉద్యమాలబాటలో............ 46 |





**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**
**ఎ.పి. రాష్ట్ర కమిటీ**



చిరునామా :

ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
కల్పన ప్రింట్స్ రోడ్, కృష్ణలంక,
విజయవాడ.
ఫోన్, 9490098620, 9490098022
E-mail : Chaitanyamanavi@gmail.com



సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్,**
**కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా**

# శక్తా? విముక్తా?

- డాక్టర్ శమంతకమణి

"వంట చేయడాన్ని నిషేధించాలి దుకాణం నుంచే ఆహారం తెచ్చుకోవాలి. ప్రతి వీధికీ ఒక దుకాణం ఉండాలి. కుటుంబం అక్కడికి వెళ్లి భోజనం చేస్తుంది. ఇక వంటా వార్పూ చింతే ఉండదు. ఇట్లా శక్తి ఎంతగా పొదుపు అవుతుందనీ".



స్త్రీలను దహించి వేస్తున్న ఇంటిపని, వంట పనుల గురించి "గురజాడ" వారు ప్రపంచానికి చాటిన ఈ వాక్యాలు చాలు స్త్రీలపట్ల వారికున్న సహానుభూతికి. కనిపించని కట్టడాల మధ్య జీవితకాల బందీలుగా మగ్గుతున్న వారి నిస్సహాయత పట్ల ఆయనకున్న సానుభూతి నుంచే విముక్తి కోసం దార్శనికతతో సమాజానికి సూచనలు చేశారు "అప్పారావు"గారు.

"స్త్రీ విముక్తి"ఇది విస్తృతంగా చర్చించబడిన నాలుగు అక్షరాల పదం.

ముక్తి అనగా మోక్షము లేదా విడుపు, విముక్తి అనగా విడవబడినది అని నిఘంటువు అర్థాలు.

బంధించబడిన స్త్రీని విడువ వలసినదిగా మనం భావించవచ్చు. ఏ వ్యక్తి అయినా, సమాజమయినా పురోగమన దిశగా, ప్రగతి మార్గంలో పయనం సాగిస్తేనే అభివృద్ధి సాధ్యమని చరిత్ర నిరూపించిన సత్యం.

అభివృద్ధి శారీరకంగానా? మానసికంగానా? ఆర్థికంగానా? భావావేశాల పరిణితి పరంగానా? అన్న ప్రశ్నలు ఆయా వ్యక్తుల, సమాజ అవసరాలను బట్టి, స్థాయిని బట్టి ఆధారపడి ఉంటుంది. మాతృస్వామ్య సమాజ అనంతరం సమాజమేదయినా, స్థాయి ఏదయినా, స్త్రీ మాత్రం ఇంచుమించుగా విశ్వవ్యాప్తంగా ఒకే విధమైన మానసిక అవసరాలు, అవస్థలతోనే ఉంది. మాతృత్వపు మధురిమలు, తల్లిగా బాధ్యతలు, ఉద్యోగినిగా సంస్థ నిర్వహణలో భాగస్వామ్యం, సమాజ గమనంలో తన పాత్రను సమర్థవంతంగా పోషిస్తూనే, కుటుంబంలో తన ఆధిపత్యాన్ని నిలుపుకోవడానికి తాపత్రయపడుతుంది. అయితే ఈ తాపత్రయం, ఆర్థిక స్వాతంత్ర్యం కొరకో, కుటుంబంలో ముఖ్యమైన సందర్భాలలో నిర్ణయాత్మక శక్తిగా వ్యవహరించడానికో గాక, "ఇంటి నిర్వహణ విధులలో" ప్రధాన బాధ్యతలుగా గుర్తించే వంట చేయడం, బట్టలుతకడం, గిన్నెలు, ఇల్లు శుభ్రపరచడం వంటి పనులలో శ్రద్ధగా వ్యవహరించడంగానే భావించబడుతుంది. పిల్లల పెంపకం అంటే ఆడవారి జీవితానికే సార్థకం అన్నట్లుగా స్త్రీ ఆలోచనలలో చాలా సహజంగా ఇంకిపోయేట్లు చేశారు. గృహిణా? ఉద్యోగినా? వ్యాపారస్థురాలా? నటీమణా, రచయిత్రా? సమాజంలో పాత్ర ఏదయినా, ఇంట్లో మాత్రం ఇవన్నీ అత్యంత సహజాతి సహజంగా విశ్వవ్యాప్త చిత్రణ కనబడుతుంది. స్థాయీ భేధాలుంటున్నాయేమో గానీ తప్పించుకోవడమన్నది ఎచ్చటా కనపడదు... కారణం,

"సేవలలో అత్తమామ సంతసించగా
పదిమందిని ఆదరించు కల్పవల్లిగా
తనయుని వీరునిగా పెంచే తల్లిగా
సతియే గృహసీమను కాంచే దేవతగా"

**ఉదాహరణకు ఇంట్లో ఏదయినా పని ఉన్నప్పుడు తల్లిదండ్రులు మొదట ఎవరికి చెబుతారు ఆడబిడ్డకా? మగ బిడ్డకా? అది ఆయా కుటుంబాల పెంపకంపై ఆధారపడి ఉంటుంది. పని విభజన ఇంట్లోనే ప్రారంభమై ఇది ఆడపని, ఇది మగపని అనుకోకుండా ఉంటే భావజాలంలో సహజంగా మార్పుంటుంది. ఈ మార్పు ప్రాధమికంగా స్త్రీలలోనే రావాలి.**

అంటూ పొగిడి, పొగిడి ఇల్లాలి పాత్ర నిర్వహణకు ఒక స్టాండర్డ్ పిక్చర్ ఎవరి స్థాయిలో వారు నిర్ణయించేశారు. అందుకే ఉదయం కాఫీ నుండీ రాత్రి ఇంటి గడియ వేయడం వరకూ స్త్రీల బాధ్యతే. ఇది తప్పా? ఒప్పా? అన్న మీమాంసకు, పనుల విభజనకు చర్చలు లేకుండానే కుటుంబం, సమాజం స్త్రీని ఒక నిర్ణీత చట్రంలోకి ఆమెకు తెలియకుండానే నెట్టేశాయి.

పరిణామ క్రమంలో ఇది ఒక సహజ ప్రక్రియా? ఖచ్చితంగా! కానీ ఎప్పటి వరకు? "న స్త్రీ స్వాతంత్ర మనర్హతి" అంటూ బంధించినంత వరకూ స్త్రీ కేవలం గృహానికే పరిమితమయినంత వరకు. గృహస్థ జీవితం రెండు చక్రాల బండి అయినపుడు ఆదాయ వనరులు, ప్రాపంచిక అవసరాల ఆర్థిక లావాదేవీలు, భర్త చూస్తుంటే...గృహ నిర్వహణ భార్య చూసుకోవడంలో తప్పు లేదని చాలా మంది భావిస్తారు. కారణం మాతృస్వామ్య వ్యవస్థ నుండే పితృస్వామ్య వ్యవస్థకు మారిన సమాజ పరిణామ క్రమం వలన. కానీ నాడు నేడు ఆధునిక మహిళగా భావించబడుతున్న మహిళా లోకం చదువులో, ఉద్యోగాలలో పురోగమిస్తూ తన ఉనికిని సమాజంలో ప్రస్ఫుటంగా ప్రకటిస్తుంది. ఎంచుకున్న రంగం ఏదయినా తన "ముద్ర" కోసం పరిశ్రమిస్తుంది... ఈ క్రమంలో సైతం వంటపని, ఇంటిపని నుండే తాను వెసులుబాటు పొందలేకపోతుంది. కారణం ఆర్థికావసరాలు, ఓ పార్శ్వం కాగా, శతాబ్దాల తరబడి మస్తిష్కంలో నాటుకుపోయిన భావ దాస్యం... ఇది స్త్రీలోనా? పురుషుల్లోనా? అన్న చర్చ పెడితే లోపం ఖచ్చితంగా ఇరువర్గాలలోనూ సుస్పష్టంగా ఉంది.

నిత్యం మనకు కన్పించే కూరలమ్మి అయినా, పూల వ్యాపారైనా, బస్సు కండక్టరయినా, మధ్యతరగతి ఉద్యోగినైనా, ఆఖరుకు ఉన్నత స్థాయి అధికారిణి అయినా... భావ దాస్యం ప్రభలంగా స్త్రీ మెదళ్ళలో కూడా నాటుకుపోయింది. పరిమిత ఆదాయ వర్గాల స్త్రీలలో "వంట మనిషిని" "గృహ నిర్వహణా సహాయకురాలికి జీతమిచ్చి పని చేయించుకోగల ఆర్థిక శక్తి లేకపోవడం... ఉన్నత ఆదాయ వర్గాలలో "నా చేతి వంట".. "నా వారి కోసమేగా నేను చేస్తున్నది" అన్న "తృప్తి" అని పేరు పెట్టుకునే భావ దాస్యం.

అందుకే కన్యాశుల్కంలో గిరీశం "దేవుడు ఆడవాళ్ళను సృష్టించింది ఎందుకు"? అనగానే బాల్యం పూర్తిగా వీడని వెంకటేశం సైతం "వంట చేయడానికి" అంటాడు. దానికి ముక్తాయింపుగా "పెండ్లాడటానికి, పిల్లలను కనడముకున్నూ" అంటాడు గిరీశం. కారణం నరనరాన, తరతరాలుగా జీర్ణించుకుపోయిన భావజాలం.

ఈ భావజాలానికి ముగింపు ఉందా? అసలు అవసరమా? అన్న ప్రశ్నలు రేకెత్తినపుడు సహజంగా సమాధానాలు మన అనుభవాలనుండే వెలువడతాయి.

ఉదాహరణకు ఇంట్లో ఏదయినా పని ఉన్నప్పుడు తల్లిదండ్రులు మొదట ఎవరికి చెబుతారు ఆడబిడ్డకా? మగ బిడ్డకా? నూటికి 99% కుటుంబాలలో ఆడపిల్లలకే ఇంటిపనిని పురమాయిస్తారు. పని విభజన ఇంట్లోనే ప్రారంభమై ఇది ఆడపని, ఇది మగపని అనుకోకుండా ఉంటే భావజాలంలో కొంత మార్పుంటుంది. ఈ మార్పు కుటుంబంలోనూ, సమాజంలోనూ రావాలి. విద్య, ఉపాధి,పారిశ్రామికీకరణతో ఆ మార్పుకు పునాది ఏర్పడింది.

నేటి సమాజంలో ఓ ఆహ్లాదకరమైన మార్పు స్త్రీ విద్యాభివృద్ధి. ఉపాధి రంగంలో వేతనాల వివక్ష ఉన్నా,. ఉపాధి కల్పనలో అవకాశాలు కల్పించడంలో ఆడవారి మేధస్సుకి, శ్రమకు కొంత ప్రాధాన్యత కనబడుతూనే ఉంది. అయితే ఇది సంపూర్ణంగా కాదు. కానీ సాధికారత దిశగా గమనం ప్రారంభమయ్యింది. అంటే స్త్రీలోని మేధోపరమైన శక్తికి, వ్యక్తిగత ప్రతిభకు అవకాశాలు పెరిగాయి. నైపుణ్యాలను అభివృద్ధి చేసుకునే దిశగా సైతం సమాజంలో మార్పు గోచరిస్తుంది. సంపాదనాపరురాలైన స్త్రీలను గతంలో కన్నా తమ కుటుంబాలలోకి ఎక్కువగా ఆహ్వానిస్తున్నారు. కారణం వరకట్నంపై వచ్చే నెలసరి వడ్డీకన్నా జీవితకాలం వచ్చే జీతాల విలువ ఎక్కువ గాబట్టి. ఈ దశలో సహజంగానే ఆడపిల్లలు తమ సమయాన్ని చదువుకి కేటాయించడం వలన విద్యార్థిని దశలో ఇంటిపని, వంటపని నేర్చుకోవడానికి అంత ప్రాధాన్యత ఇవ్వడంలేదు. కానీ "ఇల్లాలు"గా మారగానే అవన్నీ "ఇల్లాలికి"

బాధ్యతలుగా భావింపచేసి "సూపర్ ఉమన్"గా మారడానికి ప్రయత్నాలు ప్రారంభిస్తున్నారు. ఇక్కడే అసలు సమస్య బయలుదేరుతుంది భార్యగా విధులు, ఉద్యోగినిగా బాధ్యతలు వీటిని తప్పించుకోవడానికి ఎవ్వరూ ప్రయత్నించడం లేదు కారణం శరీరంలో అంగంలా, కుటుంబంలో సహజమన్న భావన. పైవారి సంస్కృతిని క్రింది తరగతులు కూడా అందిపుచ్చుకోవడంతో కష్టజీవుల కుటుంబాలలో సైతం గతంలో ఎక్కువ ఇంటిపనులు పంచుకున్న పరిస్థితి పోయింది.

మార్పు రావాల్సింది ఇక్కడే! పరిమిత కుటుంబమైనా, పదిమంది ఉన్న సంసారమైనా ఆడపిల్లకు విద్యను గరపడం ఎంత అవసరమో అంతే స్థాయిలో ఆమెలో నైపుణ్యాల మెరుగుదల కూడా అవసరం.

వంట జీవిత కాలం వరకు... ఇంటి పని మన మున్నంత కాలం ఉండే వ్యవహారం. ప్రతిదీ మనపనే అనే భావన లోనుంచి అందరం కలసి ఉండటం వలన ఏర్పడుతున్న పనులుగా భావించి పని విభజన చేసుకోగలగాలి... కానీ పురుషాధిక్య భావజాలం అణువణువునా జీర్ణించుకున్న మన భారతీయ సమాజంలో ఇది సాధ్యంగావడానికి మరింత కాలం పడుతుంది. ప్రయత్న లోపం లేకుండా కృషి చేస్తూనే ఉండాలి. కానీ గృహంలోని ప్రశాంత వాతావరణాన్ని ఛిద్రం చేసేదిశగా ఘర్షణకు తావివ్వకూడదు. కారణం కలిసున్నంత కాలం కొనసాగించే బంధాలు, బంధుత్వాలు గాబట్టి.

మరి ప్రత్యామ్నాయం ఏమిటి? సంపాదనాపరులైన స్త్రీ పురుషులు వారి సంపాదనలో 30 శాతాన్ని ప్రక్కన పెట్టాలి. వచ్చే ఆదాయంలో 70 శాతమే సంపాదనా సామర్థ్యంగా భావించాలి. 30 శాతం ఆదాయంలో 15 శాతం వంటలో సాయంగా వచ్చే వంట మనిషికి, 15 శాతం గృహ నిర్వహణలో భాగాలైన ఇల్లు శుభ్రం చేయడం, బట్టలు, గిన్నెలు వగైరా... వగైరాకు కేటాయించాలి. ఈ 30 శాతం విలువ రోజుకి ఖచ్చితంగా 5 నుంచీ 6 గంటల కాలం... జీవితకాలం తన సామర్థ్యాలు మెరుగుపరచుకుంటూ ఎంచుకున్న రంగంలో ఎదిగే క్రమంలో ఆలోచనను మార్చుకోవలసిన అవసరం, బాధ్యత మహిళలదే!

అంతేగాక 5 గంటల నుండీ 6గంటల కాలం ఆదా అవ్వడం అంటే ఆటోమేటిగ్గా శక్తిని పొదుపు చేసుకోవడం అవుతుంది. వివాహమైన తొలి దినాలలో భార్యాభర్తల అనుబంధం పెంచుకోవడానికి ఇద్దరూ కలిసి ఇద్దరూ కలిసి ఇంటిపని పంచుకోవడం సహకరిస్తుంది. "అమ్మ" అయిన వెంటనే బిడ్డల పెంపకంలో కొంత కాలం కేటాయించాల్సి వస్తుంది. బిడ్డల పెంపకం పురుషులది కూడా అన్న ఆలోచనకు మన సమాజం ఇంకా దూరంలోనే ఉంది. పాశ్చాత్య సమాజంలో మెటర్నిటీ సెలవుతో పాటు పెటర్నిటీ సెలవు కూడా ఉంది. మధ్య వయస్సులో శారీరక సమస్యలు సహజం.

***వంట జీవిత కాలం వరకు... ఇంటి పని మన మున్నంత కాలం ఉండే వ్యవహారం. ప్రతిదీ మనపనే అనే భావన లోనుంచే అందరం కలసి ఉండటం వలన ఏర్పడుతున్న పనులుగా భావించి పని విభజన చేసుకోగలగాలి... కానీ పురుషాధిక్య భావజాలం అణువణువునా జీర్ణించుకున్న మన భారతీయ సమాజంలో ఇది సాధ్యంగావడానికి మరింత కాలం పడుతుంది. ప్రయత్న లోపం లేకుండా కృషి చేస్తూనే ఉండాలి. కానీ గృహంలోని ప్రశాంత వాతావరణాన్ని ఛిద్రం చేసేదిశగా ఘర్షణకు తావివ్వకూడదు.***

హార్మోన్ల ఒడిదుడుకులు, సామర్థ్యాలపై శక్తి కన్నా విశ్రాంతి కావాల్సిన అవసరం ఉంటుంది. ఇదే దశలో కెరియర్ కూడా ఓ స్థాయికి చేరుతుంది. పిల్లల బాధ్యతల భారం ఉంటుంది. శక్తి సన్నగిల్లుతున్న తరుణంలో ఆదాయం పెరిగినా అనారోగ్యానికి ఖర్చయిపోతే వృధా అవుతుంది.

ఇది కేవలం ఉద్యోగినుల సమస్యే కాదు. ఆదాయ వనరులున్న మహిళందరి సాధారణ సమస్య... అందుకే "ఇంటిపని, వంటపని, భర్త సహచర్యం, అమ్మతనం, అత్తగారి పెత్తనం," లాంటి అన్ని పనులూ, బాధ్యతలూ నెత్తిన వేసుకుని "సూపర్ ఉమన్ సిండ్రోమ్" లో చిక్కుకుని గిలగిల లాడక... ఆదాయాన్ని అవసరాల కోసం ఎలా విభజించుకుంటామో అలాగే పనులను పంచాలి. మగువల వ్యక్తిగత సామర్థ్యాల పరిధి పెంచుకుంటూ ఆదాయ మార్గాలు కూడా విశాలం చేసుకుంటూ సంపాదనలో మూడోవంతు గృహస్థ కార్యక్రమాల సహాయకారుల కోసం కేటాయిస్తే మహిళలు సహజంగా కాస్త విశ్రాంతి పొందుతూనే "ఆధునిక మహిళలు"గా ఎదుగుతూ... ఆకాశంలో సగభాగాన్ని ఆక్రమించలేకపోయినా అవధులు చెరుపుకుంటూ ఎంచుకున్న రంగంలో నిష్ణాతులవుతారు. తెంచుకోవాల్సింది "భావ దాస్యపు సంకెళ్ళనే" బాధ్యతలను కాదు. ◆

మణిపూసలు

# సావిత్రీబాయి ఫూలే

- వకుళాభరణం లలిత

మహారాష్ట్రలోని సతారా జిల్లాలో ఖండాలా ప్రాంతంలో ఒక రైతు కుటుంబంలో జనవరి3,1831న సావిత్రిబాయి జన్మించింది. తల్లి లక్ష్మిబాయి, తండ్రి ఖండోజి. సావిత్రిబాయి సామాన్య వ్యక్తిగాదు, ఆమె ఒక సంస్థ. ఆమెకు చిన్న వయసులోనే తల్లిదండ్రులు పెళ్ళి చేసి అత్తారింటికి పంపితే కానీ తమ నెత్తినున్న బాధ్యత వదిలిపోదని భావించారు. ఈ దశలో పూలేతో వివాహం నిశ్చయమైంది. పెళ్ళి అనేటప్పటికి ఆమె హృదయం పురివిప్పిన నెమలిలాగా నాట్యం చేసింది. పెద్ద పట్నం వెళ్తున్నాననీ, గుర్రం బండిలో కూర్చొని ప్రయాణం చేస్తున్నాననీ ఉవ్విళ్ళూరింది.



స్త్రీ అంటే వంటింటికీ, వంటింటి పొయ్యికీ కట్టుబడి ఉండాలి. పొయ్యిలో కట్టెలు, పొయ్యి ఊదే గొట్టం ఆ పిల్ల చేతిలో ఉండి తీరాలి. భర్తకు, అత్తమామలకూ సేవ చేయాలి. వివాహ మండపంలో చీర సగం ఊడుతుంటే తన పరువు తీస్తున్నావని అమ్మ తిట్టే తిట్లను ఎదుర్కొంటూ, పెళ్ళికి వచ్చిన పెద్దలంతా అత్తగారిల్లు ఆమె ఇల్లంటూ రక్తంలో ఇంకిపోయేటట్లు చెప్పేవారు. సావిత్రి బాయికి 9 సం॥లు, జ్యోతిబా 12సం॥ల వయసులో పెళ్ళయింది.

ఏ కులమైనా, ఏ మతమైనా, ఆ కులానికి మతానికి సంబంధించిన కట్టుబాట్లు, అలవాట్లు, సాంప్రదాయాలు ఉన్నాయి. ముఖ్యంగా దళిత,శూద్ర కులాల్లో ఆడపిల్లలు పాఠశాలకు వెళ్ళి చదువుకునేవారు కాదు. అటువంటి తరుణంలో సావిత్రీబాయి తనకు చదివి వినిపించమని పూలేను కోరింది. హిందూ మతంలో అన్యాయం, అవినీతి చోటు చేసుకొంటున్నాయి. ఆ మతం మూర్ఖపు ఆచారాలతో సాంప్రదాయాల్లో చిక్కుకొని పోయింది. దాన్ని రూపుమాపాలని పూలే చెప్పారు. అణచివేతకు గురైన కులాల్లో ప్రజలకు చదువు చెప్పి విద్యావంతుల్ని చేయాలన్నాడు. తన భర్తను గూర్చి ఆ బుర్రలో ఎన్నో ఆలోచనలున్నాయి. ఆయన ఎంతో తెలివైనవాడు అని పొంగిపోయింది.

ఇంటికి కేంద్రం స్త్రీ. స్త్రీ విద్యావంతురాలైతేనే కుటుంబం బాగుపడుతుంది. కుటుంబంతోపాటు సమాజం కూడా బాగుపడుతుంది. ఆయన సావిత్రికి చదువుచెప్పడం మొదలుపెట్టాడు. ఆమె చేత చదివించటం, రాయించటం దినచర్య అయింది. ఆమె చదువుకొంటుంటే చూసిన వాళ్ళు ఎందుకీ చదువు, చట్టుబండలు, బ్రాహ్మణ కులంలో పుట్టినట్లుగా చదువుకు ప్రాముఖ్యం ఇవ్వకూడదు. జ్యోతిబా తండ్రి, తమ కులం వాళ్ళు చదువుకోకూడదని, సావిత్రికి చదువు చెప్పాల్సిన అవసరం లేదని అన్నాడు. చదువుకుంటే ఆమె చెడిపోతుందనీ, బుద్దిలేనిదవుతుందనీ హెచ్చరించాడు. అంతేకాదు, ఆడది చదువుకుంటే మొగుడికి ఆయుః క్షీణమవుతుందని హెచ్చరించాడు. జ్యోతిబా, సావిత్రికి ఈ కథలన్నీ చెత్త. వట్టి కట్టుకథలు. వీటిని చూసి నీవు భయపడవద్దని ప్రేమతో లాలనగా చెప్పాడు. ఈ దశలో పూలే సావిత్రికి చదువు చెప్పటమే కాదు, బడుగు వర్గాల పిల్లలందరికి సావిత్రిని చదువు చెప్పమని కోరాడు. ఈ దశలో సావిత్రి దళిత అమ్మాయిలకు చదువు చెప్పటం ఒక విడ్డూరమైన వార్త. సావిత్రి బయటకు వెళ్ళటం, చదువు చెప్పటం ప్రారంభించేటప్పటికి మామగారికి కోపం కట్టలు తెంచుకుంది. తనకోడలిని బయటకు పంపొద్దు అని ఆంక్షలు పెట్టి అందుకు విభిన్నంగా ఉంటే ఇల్లు వదిలిపెట్టి పొమ్మన్నాడు. దాంతో పూలే, సావిత్రి ఇల్లు వదిలి పోవాల్సివచ్చింది. వీళ్ళు ప్రత్యేకంగా తీసుకున్న ఇంటికి ఇద్దరు రౌడీలు చంపటానికి వచ్చారు. ఎలాగో తప్పించుకొన్నారు. ఎంతోమంది దళిత స్త్రీలకు చదువూ సంధ్యాలేదు. వాళ్ళు ఎదురొస్తే అపశకునం అనీ, అపవిత్రం అని భావించారు. ఈ రకంగా సమాజంలో జరుగుతున్న ఒడిదుడుకులను ఎదుర్కొంటూ పయనం సాగించారు. సావిత్రీబాయి మొదటి పంతులమ్మ

అయింది. సమాజాన్ని మార్చటంలో పూలే దంపతులు ఎంతో కృషి చేశారు. పూలే దంపతులకు పిల్లలు లేరు. ఒక బ్రాహ్మణ వితంతువుకన్న బిడ్డను పెంచుకున్నారు. పెళ్ళిళ్ళలో విపరీతంగా డబ్బు ఖర్చు పెట్టకూడదని నిర్ణయించారు. వాళ్ళు స్థాపించిన సత్యశోధక సమాజం పద్ధతిలో వివాహాలు జరిపించాలని ప్రయత్నం చేశారు. జ్యోతిబా కుమారుడికి కూడా అదేవిధంగా వివాహం చేయతలపెట్టారు. ఈ విధంగా వివాహం చేయటం సమాజానికి ఇష్టం లేదు. దాంతో భార్యభర్తలిద్దరూ సమాజానికి పూర్తిగా వ్యతిరేకులయ్యారు.

**సావిత్రి దళిత అమ్మాయిలకు చదువు చెప్పటం ఒక విడ్డూరమైన వార్త. అటువంటి దశలో, సావిత్రి బయటకు వెళ్ళటం, చదువు చెప్పటం ప్రారంభించేటప్పటికి మామగారికి కోపం కట్టలు తెంచుకుంది. తనకోడలిని బయటకు పంపొద్దు అని ఆంక్షలు పెట్టి అందుకు విభిన్నంగా ఉంటే ఇల్లు వదిలిపెట్టి పొమ్మన్నాడు. దాంతో పూలే, సావిత్రి ఇల్లు వదిలి పోవాల్సివచ్చింది. వీళ్ళు ప్రత్యేకంగా తీసుకున్న ఇంటికి ఇద్దరు రౌడీలు చంపటానికి వచ్చారు. ఎలాగో తప్పించుకొన్నారు. ఎంతోమంది దళిత స్త్రీలకు చదువూ సంధ్యాలేదు. వాళ్ళు ఎదురొస్తే అపశకునం అనీ, అపవిత్రం అని భావించారు. ఈ రకంగా సమాజంలో జరుగుతున్న ఒడిదుడుకులను ఎదుర్కొంటూ, పయనం సాగించారు.**

మహర్షి కార్వే స్థాపించిన మొదటి మహిళా విశ్వవిద్యాలయానికి 1840లోనే తన 17 ఏళ్ళ వయసులో సావిత్రిబాయిపూలే మహిళా టీచర్‌గా చేరి ఎంతోసేవ చేసింది. పూలే నడిపిన సత్యశోధన ఉద్యమంలో చేదోడు వాదోడుగా సావిత్రి నిలిచారు. పాఠశాలకు వెళ్ళే సమయంలో ఆమెపైన పేడనీళ్ళు కొట్టినా, ఎవరెన్ని విధాల తుస్కారం చేసినా వాటిని లెక్క చేయక ఉపాధ్యాయ వృత్తిని కొనసాగించారు. కుటుంబంలో ఎన్ని కలహాలు తలెత్తినా, ధైర్యంగా, సాహసంగా ఉపాధ్యాయినిగా పనిచేశారు. సంప్రదాయ వాదుల, బ్రాహ్మణవాదుల అవహేళనలను ఎదుర్కొన్నారు. తొలిమహిళా ఉపాధ్యాయినిగా మనగలిగారు. సమాజానికి విరుద్ధంగా ఆడపిల్లలను చదివించటం వాళ్ళ విజయంలో మొదటిమెట్టుగా భావించారు. ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొని ముందుకు సాగారు. మొదట సమాజం వ్యతిరేకించినా స్నేహితుల పిల్లలను తీసుకొచ్చి, వాళ్ళకు మిఠాయిలు ఇచ్చి, ఆటపాటలను నేర్పి, విద్యావంతులుగా తీర్చిదిద్దారు. ఆడపిల్లలు పైకి రావాలి అనే ఉద్దేశంతోనూ, వాళ్ళను అభివృద్ధి పరచాలనే సంకల్పంతో1848లో మొదటి పాఠశాలను ప్రారంభించారు. ఎంతో ఓర్పుతో సానుకూల పరిస్థితులను ఏర్పరచి వారికి విద్యబోధించారు. స్త్రీవాదులు ముక్తాబాయి, తారాబాయి షిండేలు కూడా ఈ పాఠశాలలో చదివినవారే. పూలే నడిపిన ప్రతి ఉద్యమంలోనూ అది సారావ్యతిరేక, సత్యశోధక తొలి కార్మిక ఉద్యమాల్లో సైతం సావిత్రిబాయి ప్రముఖ పాత్ర వహించారు. భారత దేశంలో దళిత, శూద్ర స్త్రీల కోసం, అస్పృశ్యుల కోసం ప్రారంభించిన తొలి పాఠశాల ఇదేనని చెప్పవచ్చు.

బ్రిటిష్ ప్రభుత్వం ఆనాడు సంస్కరణలకు అనుకూలంగా ఉండేది. దళితులకోసం దంపతులిరువురూ ఒక విద్యార్థి వసతి గృహాన్ని మొదలు పెట్టారు. అది 25,30 మందికి సరిపడే స్థలం. నిరుపేదలు డబ్బు చెల్లించనక్కరలేదు. ఇంతలో 1877వ సంవత్సరం తీవ్రమైన కరువు వచ్చింది. ప్రజల బాధలు చూడలేకపోయారు. ఆ గుడిసెల్లో పేద ప్రజలు కూడూ, నీళ్ళు లేక కృశించి చచ్చిపోతుంటే సహించలేకపోయారు. ఒక తల్లి తన కొడుక్కి విషం ఇచ్చి తాను తిని చనిపోయింది. ఈ విధమైన పరిస్థితుల్లో తమకు వీలైనంతలో పేద ప్రజానీకానికి దంపతులిరువురూ తోడ్పడ్డారు. ఆ సంవత్సరమే కృష్ణారావు గారు 'దీనబంధు' అనే పత్రికను స్థాపించారు. వల్వేకర్ 'గృహిణి' అనే పత్రికను స్థాపించారు. స్త్రీల సమస్యలను గూర్చి, గర్భిణీ స్త్రీలు తీసుకోవాల్సిన జాగ్రత్తలను గూర్చి వివరాలు ఆ పత్రికలో

**సావిత్రిబాయి నిరాడంబర జీవితం ఆదర్శవంతమైంది. ఆమె దుస్తులను ఆమె కుట్టుకునేవారు. ఖాదీ దుస్తులను ధరించేవారు. ఖాదీ ఉద్యమానికి శ్రీకారం చుట్టింది పూలే దంపతులే. మహిళల్లో చైతన్యం కలిగించటానికి ఆమె మహిళా సేవామండలిని ప్రారంభించారు.**

ఉన్నాయి. ఆ పత్రికలో జ్యోతిబా భార్య ఇంటికి మాత్రమే పరిమితమైతే సమాజంలో ఏం జరిగేది? అట్లే వైధవ్యం పొందిన స్త్రీలు అమంగళంగా జుట్టు తీయించుకోవటం వంటి వాటిని వీరిరువురూ ఖండించారు. సమాజంలో జరుగుతున్న అన్యాయాలనూ, అక్రమాలనూ ధైర్యంతో ఎదుర్కొన్నారు. సావిత్రి సమాజానికంతటికీ మాతృమూర్తి. సావిత్రి చేయాల్సిన పనులు

ఒక జీవిత కాలం సరిపోవు. వాళ్ళిద్దరూ కలిసి జీవించిన జీవితం కానీ, చేసిన ఘనకార్యాలు కానీ సమాజానికి మార్గదర్శకాలు. జ్యోతిబా పూలే మరణించినపుడు ఎవరు అంత్యక్రియలు చేయాలి? అనే ప్రశ్న వస్తే, ధైర్యంగా సావిత్రి తానే స్వయంగా ఆ బాధ్యతను నిర్వహించింది.

సావిత్రిబాయి నిరాడంబర జీవితం ఆదర్శవంతమైంది. ఆమె దుస్తులను ఆమె కుట్టుకునేవారు. ఖాదీ దుస్తులను ధరించేవారు. ఖాదీ ఉద్యమానికి శ్రీకారం చుట్టింది పూలే దంపతులే. మహిళల్లో చైతన్యం కలిగించటానికి ఆమె మహిళా సేవామండలిని ప్రారంభించారు.

సావిత్రిబాయి ఏకసంథాగ్రహి. ఆమెకున్న జ్ఞానదాహం ఆ రోజుల్లో ఎవరికీ లేదు. ఆమె ధైర్యశాలి. ధైర్యంతో ఆమె తీసుకున్న నిర్ణయాలను అమలు జరపగల విశిష్ట వ్యక్తిత్వం ఆమెకు ఉంది. బెదిరింపులనూ, సంఘ వ్యతిరేకవాదుల మాటలనూ ఆమె లెక్కచేయలేదు. ఎందరు ఎన్ని బెదిరించినా చెవిటి వాడి ముందు శంఖం ఊదినట్లు ఆమెపై ఏ ప్రభావమూ చూపలేదు. పాఠశాలలోనే రెండువేల మంది విద్యార్థుల బాధ్యతను తీసుకొని వాళ్ళందరికీ విద్యాదానం, ప్రాణదానం చేశారు. చిన్నతనంలోనే మృగాళ్ళ దాష్టీకానికి బలైన స్త్రీలను ఎంతోమందిని ఆ దంపతులు ఇరువురూ ఆదుకున్నారు. "బాలహత్య ప్రతిబంధక్ గృహ" అనే పేరుతో బాల వితంతువులకు, వారి బిడ్డలకు సంరక్షణ కేంద్రం ఏర్పాటుచేశారు. చిన్న వయసులోనే వితంతువులైన ఆడపిల్లలు ఉమ్మడి కుటుంబాలలో లైంగిక వేధింపులు, కొన్నిసార్లు అత్యాచారాలకు గురైన ఆడపిల్లలు గర్భవతులవ్వటంతో ఆత్మహత్యలు చేసుకునేవారు. అలాంటి ఆడపిల్లలకు,వారు కన్న బిడ్డలకు రక్షణ కల్పించారు.

పూలే మరణంతో కుంగిపోకుండా తాము ఉద్దేశించిన కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించారు. సావిత్రి స్త్రీల అభ్యున్నతి కోసం కృషి చేయటమేగాక ప్రజల జీవితాల్లో మార్పు కోసం ఆమె ఎంతో కృషి చేశారు. ఒక సామాన్య స్త్రీగా జీవితాన్ని ప్రారంభించి, ఆచరణ ద్వారా ఒక మహోన్నత చైతన్యమూర్తిగా ఎదిగారు. సమాజంలో స్త్రీని అణచివేసిన సంఘటనలు ఎన్నివున్నా స్త్రీల, దళితుల సమస్యల పరిష్కారానికి కృషి చేసే సంస్థల స్థాపనకు సావిత్రీబాయే మూలం. 1897లో పూనాలో ప్లేగువ్యాధి ప్రబలింది. పూనా పట్టణమంతా ఎడారి అయిపోయింది. కుమారుడు యశ్వంత్, తాను కలిసి గుడిసెల్లోకి వెళ్ళి పనిచేయటం ప్రారంభించారు. ఇది అంటువ్యాధి, అక్కడకు వెళ్ళకూడదని వాళ్ళను ఆటంకపరిచారు. అవసరమొచ్చినప్పుడు ఆ పనిచేయవచ్చునా? చేయకూడదా? పని చేయటం శ్రేయస్కరమా? కాదా? అనే మీమాంస లేకుండా పనిలో ముందంజ వేశారు. ప్లేగు వ్యాధిగ్రస్తులకు సేవ చెయ్యటంతో ఆమె కూడా ప్లేగువ్యాధికి గురై చనిపోయారు. మహారాష్ట్ర ప్రభుత్వం ఆమె పేరుతో అవార్డు నెలకొల్పింది. పూనా యూనివర్శిటీకి సావిత్రిబాయి పూలే పూనా యూనివర్శిటీగా పేరు మార్చారు. స్త్రీల అభ్యుదయానికి కృషి చేసిన సావిత్రిబాయి పూలే మనందరకూ ఆదర్శం. ◆

# నేను అతివను

- ఆర్.దుర్గా ప్రసన్న

నాలో నేనై తిరుగాడు నేను
ధరిత్రిని కాను - కాలేను
కారణం - ఇక్కడ
న్యాయాన్ని - అన్యాయాన్ని
దుర్మార్గులనూ, సన్మార్గులనూ
సమానంగా భరించలేను నేను!!

నాలో నేనై తిరుగాడు నేను
మండలాధీశుడనగు
ఆధిత్యుడను కాలేను
కారణం -నేను
నా వెల్గును పంచి ఇవ్వడమే కాదు
నాతో పాటు శతకోటి జ్యోతులను
ప్రజ్వరిల్లింపగల ధీశాలిని నేను!!

నాలో నేనై కదలాడినా
నేను సెలఏరునూ కాను
కారణం- నా పరవళ్లలో
ఆహ్లాదమే కాదు
అణువుణువు నా ఆవేశం
నిండివుంది.
అహర్నిశలూ లక్ష్యం వైపు
పురోగమించే స్ఫూర్తి ఉంది.!!

నాలో నేనై ఉరకలేసినా
ఉప్పొంగు సముద్రుడ్ని కాను
కారణం-
ఆణిముత్యాలనూ,
అంతు తెలియని అపూర్వ సంపదనూ
అగాధం వంటి నా మదిలోనే
నిక్షిప్తం చేసుకోలేను!!

ఇంతకూ నేను నేనే!
ఓ మనసుని! ఓ మనిషిలోని
మనసుని!!
ఓ అతి మామూలు అతివని!!! ◆

కథ

# మోనికా... యూ ఇడియట్

గురజాడ శత వర్ధంతి సందర్భంగా గురజాడ స్ఫూర్తితో విద్యా నిర్వహించిన కథల పోటీలో రెండవ బహుమతి పొందిన కథ

- రాజేష్. యాళ్ళ

"నిజమే మోనికా నువ్ బాగా చేసావ్ అని నువ్వు అనుకుంటున్నావ్! ఈ ప్రాజెక్ట్ ఫీజబులా కాదా అని అలోచించాల్సింది నేను కదా?!" తన చేతిలోని పెన్సిల్ని విలాసంగా తిప్పుతూ చెప్పాడు రిషి.

"దీని కోసం నేను చాలా కష్టపడ్డాను రిషీ! ఈ ప్రాజెక్టు కోసం డే అండ్ నైట్ ఎంత కష్టపడ్డానో మీకు కూడా తెల్సు!" తను తయారుచేసిన సాఫ్ట్‌వేర్ అంత తేలికగా తీసిపారేసేసరికి కన్నుల్లో నీళ్ళు తిరగడంతోపాటుగా ఉక్రోషంతో ఆమె ముఖం ఎర్రగా మారిపోయింది.

"కష్టపడటం అందరూ చేస్తారు మోనీ...కావల్సిందేమిటంటే ఫీజబిలిటీ ఉండేలా కష్టపడటం. సో నాకైతే అదేమీ నీ వర్క్‌లో కనబడటం లేదు." తన విలాసాన్ని మరింత ఎక్కువ చేస్తూ చెప్పాడు రిషి.

"రిషీ, మీరూ నేనూ ఒకేసారి ఇక్కడ జాయినయ్యాం. నా హార్డ్ వర్క్ గురించి, వర్క్ క్వాలిటీ గురించి కూడా మొదటి నుండీ మీకు తెలుసు, అయినా ఇలా మాటలాడ్డం..."

కరెక్ట్ కాదంటావ్ అంతేనా మోనీ? నిజమే ఇదివరకు మనం ఒకే క్యాడర్లో ఉన్నాం. అయితే ఇప్పుడు నీ మాట వినాలా? ఈ పొజిషన్‌కి నేనెంత కష్టపడితే వచ్చానో నీకేం తెలుసు?" రిషీ మొఖంలో కోపం ప్రత్యక్షమైంది.

"ఐ డోంట్ మీన్ దట్ రిషీ... ఒకప్పుడు మనం కలిసి పనిచేసిన ఫ్రెండ్స్. కనీసం అదైనా గుర్తు పెట్టుకుని నా ప్రాజెక్ట్ అప్రూవల్‌కి రికమెండ్ చెయ్యమని రిక్వెస్ట్ చేస్తున్నా అంతే". దీనంగా అడిగింది మోనిక.

"అలాంటి రిక్వెస్టులు నా దగ్గర కుదరవ్ మోనీ. నా కెరీర్లో ఇప్పటికి మూడు నాలుగు ప్లేసెస్ మారి ప్రమోషన్ మీద ఇక్కడికొచ్చానంటే నా టాలెంట్ వల్లే. టాలెంట్ ఉన్నచోట నో రిక్వెస్టు యూ నో?" ఎదురు ప్రశ్నించాడు రిషి.

ఇది వరకు చేసినా నా ప్రాజెక్ట్స్ అన్నీ ఇమీడియట్‌గా అప్రూవ్ అయిపోయాయ్. ఇదొక్కటీ కూడా అయిపోతే నా నెక్స్ట్ ప్రమోషన్‌కి ప్లస్ అవుతుంది రిషీ!" అర్థిస్తూ చెప్పింది మోనిక.

"ఆ విషయం నాకు తెలీదా మోనీ....ఈ రిషికి అన్నీ ఎవరూ చెప్పకుండానే తెలిసిపోతాయ్. అంతగా రిక్వెస్ట్ చేస్తున్నావ్ కాబట్టి ఆలోచిస్తాను. నేను ఆలోచించాలంటే నువ్ కూడా కాస్త ఆలోచించాలి మరీ!" కనీ కనిపించకుండా నవ్వుతూ చెప్పాడు రిషి.

" ఏం ఆలోచించాలి?" ఆత్రంగా అడిగింది మోనిక.

"ఇందాక ఈ ప్రాజెక్ట్ కోసం డే అండ్ నైట్ కష్టపడ్డానని చెప్పావ్ కదా, ఆ కష్టంలో ఓ భాగంగా జస్ట్ ఒక్క నైట్ నువ్ నాతో... అఫ్ కోర్స్ నిన్ను కష్టపెట్టననుకో... నైటంతా ఇద్దరికీ సుఖమే!" కాంక్షగా మోనికను చూస్తూ చెప్పాడు రిషి.

"యూ...." మోనిక అరిచింది.

"అరిస్తే పనులు కావు మోనీ... నవ్ యు కెన్ గో!" నవ్వుతూ చెప్పాడు రిషి.

అవమానంతో ఎరుపెక్కిన ముఖంతో, పొంగుకొస్తున్న దు:ఖంతో అతని దగ్గర్నుండి తన సీట్లోకి వచ్చి కూర్చుంది మోనిక.

సీట్లో కూర్చుంది కానీ ఆమెకు రిషితో జరిగిన ఆ సంభాషణే పదే పదే గుర్తుకొస్తోంది. అయిదేళ్ళ క్రితం కాలేజి సెకండర్ టాపర్ అయిన తనకు ఈ కంపెనీ పిలిచి మరీ జాబ్ ఇచ్చింది. తనతో పాటే మరో కాలేజి నుండి సెలెక్ట్ అయి వచ్చిన రిషి వచ్చిన రెండేళ్ళలోపే తన బ్యాచ్‌ను దాటి డబుల్ ప్రమోషన్

**అయిదేళ్ళ క్రితం కాలేజి సెకండర్ టాపర్ అయిన తనకు ఈ కంపెనీ పిలిచి మరీ జాబ్ ఇచ్చింది. తనతోపాటే మరో కాలేజి నుండి సెలెక్ట్ అయి వచ్చిన రిషి వచ్చిన రెండేళ్ళలోపే తన బ్యాచ్‌ను దాటి డబుల్ ప్రమోషన్ తీసుకుని వెళ్ళిపోయాడు. అదంతా అతని టాలెంట్ ల్లనే అనుకుంటే పొరపాటే. పక్కవాళ్ల క్రెడిట్‌ని తనదిగా పైవాళ్ళకి చూపించ త్వరత్వరగా ప్రమోట్ అయిపోయాడతను.**

"ఏమయింది మోనికా అలా ఉన్నావ్?!" పక్క క్యూబికల్ నుండి సారిక పలకరించింది.

"రిషి నా ప్రాజెక్టులో ఫిజబిలిటీ లేదంటున్నాడు". బాధగా చెప్పింది మోనిక.

"రిక్వెస్ట్ చెయ్యకపోయావా? మీ ఇద్దరూ కలిసి పని చేసినట్టుగా కూడా ఉన్నారు?!" అడిగింది స్మిత.

"ఔను, ఎంత అప్పీల్ చేసినా వినలేదు".

"ఎందుకు వినరు? ఈ మగాళ్ళకు కావలిసింది పడేస్తే వాళ్ళే కుక్కల్లా మా మాట వింటారు." భుజాలను ఎగరేస్తూ చెప్పింది స్మిత.

నమ్మలేనట్టుగా ఆమె వైపు చూసింది మోనిక.

తీసుకుని వెళ్ళిపోయాడు. అదంతా అతని టాలెంట్ వల్లనే అనుకుంటే పొరపాటే. పక్కవాళ్ల క్రెడిట్‌ని తనదిగా పైవాళ్ళకి చూపించి త్వరత్వరగా ప్రమోట్ అయిపోయాడతను. దానిలో భాగంగా అందరితో ఎంతో చక్కని స్నేహితుడిలా నటిస్తూ వాళ్ళ సిస్టంలో సమాచారం అంతా తను దొంగిలించి ఏం జరిగిందో గ్రహించేలోపుగానే మరో సిటీకి వెళ్ళిపోయిన రిషికి కేవలం కెరీర్ అంటే పిచ్చి ఉందనుకుంది. కానీ ఇలా స్త్రీలోలత్వం కూడా అబ్బిందని గ్రహించాక అతనంటే మరింత అసహ్యం పెరిగిపోతోంది మోనికకు.

"ఏమయింది మోనికా అలా ఉన్నావ్?!" పక్క క్యూబికల్ నుండి సారిక పలకరించింది.

"రిషి నా ప్రాజెక్టులో ఫిజబిలిటీ లేదంటున్నాడు". బాధగా చెప్పింది మోనిక.

"రిక్వెస్ట్ చెయ్యకపోయావా? మీ ఇద్దరూ కలిసి పని చేసినట్టుగా కూడా ఉన్నారు?!" అడిగింది స్మిత.

"ఔను, ఎంత అప్పీల్ చేసినా వినలేదు".

"ఎందుకు వినరు? ఈ మగాళ్ళకు కావలిసింది పడేస్తే వాళ్ళే కుక్కల్లా మన మాట వింటారు." భుజాలను ఎగరేస్తూ చెప్పింది స్మిత.

నమ్మలేనట్టుగా ఆమె వైపు చూసింది మోనిక.

"యా మోనికా కమాన్! రిషీ హేడ్ ఆల్రెడీ సర్పాస్ట్ యూ ఇన్ కెరీర్. నీకు సిగ్గనిపించడంలేదా? కెరీర్ ఫాస్ట్‌గా వెళ్ళాలంటే మనం కొన్ని పనులు చెయ్యాలి. ఇంకా పవిత్రత అంటూ ముడుచుకు పోతే ముందుకు వెళ్ళలేం. నిజానికి ఇట్స్ గాడ్స్ గిఫ్ట్ టూ బీ ఏ వుమన్, విచ్ మేక్స్ ఆదర్ థింగ్స్ క్వైట్ ఈజీ!" చాలా మామూలుగా చెప్పింది స్మిత.

నివ్వెరపోయి చూసింది మోనిక. " అలా ప్రమోషన్స్ తెచ్చుకోవడం నాకిష్టం లేదు స్మితా!" నిష్కర్షగా చెప్పింది.

"దెన్, యూ విల్ బీ ద లూజర్! నువ్ మరీ సిక్స్టీంత్ సెంచరీలోనే ఉండిపోతున్నావ్ మోనికా. ప్లీజ్ కం అవుటాఫ్ దట్!" కొంచెం కోపంగా చెప్పింది స్మిత. తన రివాల్వింగ్ చెయిర్ని తన కంప్యూటర్ స్క్రీన్ వైపు విసురుగా తిప్పి అందులో తల దూర్చేసింది.

"నీలాంటి వాళ్ళ వల్లే ఆడవాళ్ళంటే ఉన్న గౌరవం కాస్తా పోతోంది." అనుకుంటూ తిరిగి ఆలోచనలో పడింది మోనిక.

ఇంటికి వెళ్ళినా మోనికకు ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. ఈ ప్రాజెక్ట్ ఆమోదించకపోతే తనకు కెరీర్లోనే పెద్ద రిమార్క్ అలా అని రిషి చెప్పిన మాట వినేందుకూ మనసు లొంగడంలేదు. అయినా ఆ రిషిగాడు ఎంత స్కౌండ్రల్. ఆడవాళ్ళంటే ఎంత లోకువ! వాడు పనిచేసిన చోటల్లా అధికారం ద్వారా ఇలా అమ్మాయిలందరినీ లోబరుచుకోవడం ఎంత ఘోరం!! ఏదో ఒక నిర్ణయం తను త్వరగా తీసుకోవాలి. ఆలోచనలతోనే ఆ రాత్రి తెల్లవారింది.

"హాయ్ గుడ్ మాణింగ్ మోనీ... హవ్వార్యూ టుడే? ప్రాజెక్ట్ సబ్మిషన్ లేటైపోతుంది కదా మోనీ ఏమైనా ఆలోచించావా?" ఇంటర్కంలో అడిగాడు రిషి.

"రిషీ దాన్ని పైకి రికమండ్ చేయాల్సింది మీరే." మళ్ళీ అనునయంగా చెప్పేందుకు ప్రయత్నించింది మోనిక.

"అలా చెయ్యాలంటే ఏం చెయ్యాలో చెప్పింది కూడా నేనే మోనీ... సో బాల్ ఈజ్ ఇన్ యువర్ కోర్ట్ ఓన్లీ. డిసైడ్ క్విక్!" కూల్‌గా చెప్పాడు రిషి.

"నాక్కొంచెం టైం కావాలి రిషీ."

"ఓ గుడ్. కొంచెం నా దారిలోకొచ్చావన్న మాట! నో ప్రోబ్లం... ఎన్ని రోజులు పడుతుంది నువ్ డిసైడ్ చేసుకోవడానికి?" గొంతు నిండా ఆనందం నింపుకుని అడిగాడు రిషి.

"జస్ట్ త్రీ డేస్ టైం ఇవ్వు చాలు. రేపటి నుండి మూడు రోజులు లీవ్ తీసుకుంటాను." మోనిక చెప్పింది.

"ఆఫ్టరాల్ చిన్న డెసిషన్ కోసం త్రీ డేస్ లీవా?! సరే మోనీ నువ్ చెప్పబోయేది వెరీ స్వీట్ న్యూస్ అని నాకు తెలిసినపుడు

నీకు మూడు రోజులు సెలవు ఇవ్వడం నాకు ప్రాబ్లం కాదు. గో అహెడ్." ఫోన్ కట్ చేసాడు రిషి.

నీరసంగా ఫోన్ పెట్టేసింది మోనిక.

◆◆◆

ఆ సాయంత్రం వరకూ అన్య మనస్కంగానే పనిచేసింది మోనిక. మూడు రోజుల్లో ఏం చెయ్యాలో అన్నదే ఆమె ఆలోచన. సాఫ్ట్‌వేర్ బ్యాక్ గ్రౌండ్‌తో వచ్చిన తనకు ఈ మూడురోజులూ అగ్ని పరీక్షే అనుకుంటూ భారంగా ఇంటివైపు అడుగులు వేసింది మోనిక.

...

"ఇలాంటివి ఇలా ఫోన్లో కాదు కానీ ఒక్కసారి నా క్యాబిన్లోకి రా మోనీ!" రిషి చెప్పాడు.

మోనిక రిషీ క్యాబిన్లోకి వెళ్ళింది. "వెల్కం మోనీ... ఈ మూడురోజులూ గడవడం నాకెంత కష్టమయ్యిందో తెలుసా? ఇంతకూ పాజిటివ్ డెసిషన్‌తోనే వచ్చావుగా?" రిషి అడిగాడు.

"యస్ రిషీ. కానీ ఓ కండిషన్. వెన్యూ నేనే డిసైడ్ చేసాను."

"వావ్ వెన్యూ కూడా ఫిక్స్ చేసావా మోనీ.... గ్రేట్ గోయింగ్! ఇంతకీ ఎక్కడ?" ఉత్సాహంగా అడిగాడు రిషి.

"హొటల్ స్వాగత్ పారడైజ్" ...తల దించుకుని చెప్పింది మోనిక. మనం గడపబోయే ఆనంద క్షణాలకు సింబాలిక్‌గా కూడా ఉంది కదూ?" నవ్వుతూ మోనిక వైపు చూసాడు రిషి.

"రూం నంబర్ ఫోర్ టూ జీరో. నైట్ ఎయిట్ కల్లా అక్కడే ఉంటాను." మోనిక చెప్పింది.

"నువ్ సూపర్ మోనీ... ఆయాం రియల్లీ ఆన్ క్లౌడ్ నైన్! నీలాంటి హోమ్లీ గాళ్ ఇలాంటి డెసిషన్ తీసుకోవడం నాలాంటి వాళ్ళకు భలే కిక్కిస్తుందిలే. ఎనీ హౌ,ఐ షల్ బీ దేర్ ఎట్ నైన్ పీ ఎం!" ఎగిరి గంతేసినట్టు చెప్పాడు రిషి.

◆◆◆

హొటల్ స్వాగత ప్యారడైజ్ రూం నంబర్ ఫోర్ టూ జీరో దగ్గర ఆగి తలుపు తట్టాడు రిషి.

మోనిక వచ్చి తలుపు తీసింది. "వావ్ వండర్ఫుల్ ఎట్మాస్ఫియర్. ముందే డల్ చేసేసావా లైటింగ్?" నీలిరంగు కాంతి నింపుకున్న ఆ రూమంతా పరికించి చూస్తూ అడిగాడు మోనిక.

ఇంకేంటి మోనీ... నువ్వింత తేలిగ్గా సరెండర్ అయిపోతావని కలలో కూడా ఊహించలేదు. ఇన్నాళ్ళకి కెరీర్ పైన నీకు ఇంట్రెస్ట్ కలగడం నా లక్! మరి లేట్ చేసే కొద్దీ టైం వేస్ట్ కదా, రా

"ఆ...ఆ... ఒన్ మినిట్ రిషీ! నువ్వన్న ఈ గోల్డెన్ మూమెంట్స్ కోసం ఈ త్రీ డేస్ చాలా ప్రిపేర్ అయ్యాను రిషీ! ఇది మనిద్దరికీ..... ముఖ్యంగా నీకు మరిచిపోలేని అందమైన అనుభవంగా ఉండాలని నా ఉద్దేశ్యం. ఏమంటావ్?! బెడ్ మీద కూర్చుంటూ నవ్వుతూ అడిగింది మోనిక.

మరీ!" అంటూ బెడ్‌పైన కూర్చున్నాడు రిషి.

"ఏమయింది రిషీ?" అడిగింది మోనిక. మౌనంగా రిషివైపు నడిచింది మోనిక. అంతలో ఏదో గుర్తొచ్చిన వాడిలా లేచాడు రిషి.

"నీ ఇంటిలిజెన్స్ మీద నాకు నమ్మకం ఎక్కువ మోనీ... ఒన్ మినిట్". అని చెప్పి లైట్ ఆఫ్ చేసి తన మొబైల్ ఫోన్ చేత్తో పట్టుకుని రూమంతా తిరిగాడు రిషి.

"గుడ్ ...హిడెన్ కెమేరాస్ లాంటి భయంకరమైన ఆలోచనలేమైనా నీకొచ్చాయేమో అని..." అని నవ్వాడు రిషి. చీకటిలో మోనిక స్పందన తెలియలేదు అతనికి.

"మోనికా చిన్న రిక్వెస్ట్."

"చెప్పు రిషీ."

"ఈ గోల్డెన్ మూమెంట్స్ నాకు కళ్ళారా చూడాలని ఉంది. అందుకని ట్యూబ్‌లైట్ వేస్తాను. ప్లీజ్ కాదనకు." బ్రతిమాలాడు రిషి.

"నీ ఇష్టం రిషీ!" మోనిక బదులిచ్చింది.

"వావ్ మోనికా ఎంత అడ్వాన్స్ థింకింగ్‌లోకి వచ్చావ్. థాంక్యూ సో మచ్!" అంటూ లైట్ స్విచ్ ఆన్ చేసాడు రిషి.

అల్లంత దూరంలో మోనిక ఊరిస్తూ కనిపించింది రిషికి, గబగబా ఆమెను సమీపించి కౌగిలించుకోబోయాడు రిషి.

"ఆ...ఆ... ఒన్ మినిట్ రిషీ! నువ్వన్న ఈ గోల్డెన్ మూమెంట్స్ కోసం ఈ త్రీ డేస్ చాలా ప్రిపేర్ అయ్యాను రిషీ! ఇది మనిద్దరికీ..... ముఖ్యంగా నీకు మరిచిపోలేని అందమైన అనుభవంగా ఉండాలని నా ఉద్దేశ్యం. ఏమంటావ్?! బెడ్ మీద కూర్చుంటూ నవ్వుతూ అడిగింది మోనిక.

"ఓహ్ ష్యూర్ మోనీ.... థ్యాంక్స్ ఫర్ దట్ రియల్లీ... ఏది ఎలా జరగాలో కూడా నువ్వే ప్లాన్ చేసావా?! హౌ రొమాంటిక్ యూ ఆర్?!!! సరే ఏం చెయ్యాలో నువ్వే చెప్పు!" పట్టరాని సంతోషంతో అన్నాడు రిషి.

"అమ్మాయిలు డామినేటింగ్‌గా ఉంటే మీ మగవాళ్ళకు సాటిస్ఫాక్షన్ ఎక్కువగా ఉంటుందని తెలుసుకున్నా రిషీ. వై కాంట్ ఏ ట్రై దట్?!" అడిగింది మోనిక.

"ఓహ్ దట్స్ రియల్లీ ఆసం అండ్ ఇరోటిక్.... ష్యూర్ ష్యూర్ మోనీ....నువ్ బాగా ప్రిపేరై వచ్చినట్టు నన్ను నువ్ అని పిలిచినప్పుడే నాకర్థమైంది! కమాన్ టెల్ మీ నవ్.... వాట్ షల్ ఐ డూ మోనీ.... కమాన్ టెల్ మీ! ఉద్రూతలూగుతున్న ఉత్సాహంతో అన్నాడు రిషి.

"ష్యూర్ రిషీ..... ఇప్పుడు నువ్ అక్కడే నిలబడి నేను చెప్పినట్లుగా చెయ్యాలి. ఓకే?!" మోనిక నవ్వులో ఎప్పుడూ లేని మత్తు కనిపించింది రిషీకి.

"దట్స్ రియల్లీ గ్రేట్. యూ ఆర్ ఫేబ్యులస్ మోనీ" రిషీ ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోతున్నాడు.

"ఒకే..రిషీ నవ్ టేక్ ఆఫ్ యువర్ షర్ట్"

"ఓహ్...ష్యూర్ మోనీ..."గబగబా తన టీషర్ట్‌ను పైకెత్తి తీసేసాడు రిషీ.

"వావ్... రియల్లీ సల్మాన్ ఖాన్ ఈజ్ ఏ ఫస్ట్ ఫెలో బిఫోర్ యూ.. నవ్ టేక్ ఆఫ్ యువర్ ప్యాంట్!"

మోనిక పొగడ్తకు, ఆమె కంఠంలోని కమాండ్‌కు మరింతగా పొంగిపోయాడు రిషి. "ష్యూర్ మోనికా బేబీ.. ఇట్స్ రియల్లీ అన్‌బిలీవబుల్!"మోనిక చెప్పిన పని చేస్తూ చెప్పాడు రిషి.

"యూ ఆర్ వెరీ హుంబల్ రిషీ.. నైన్ ఆఫ్ యూ..."చెప్పింది మోనిక.

"థ్యాంక్స్ ఎ లాట్ మోనికా! ఇంతవరకూ ఇలాంటి థ్రిల్ నేనెప్పుడూ ఫీలవ్వలేదు!"

"మోర్ థ్రిల్ ఇన్ ది ఆఫింగ్ రిషీ.. కమాన్.. ఇంకా ఆ ఒక్కటీ కూడా ఎందుకూ.. టేక్ ఆఫ్ ది అండర్వేర్ టూ డియర్ రిషి.. యూ ఆర్ ఆల్సో రియల్లీ ఆసం!" చెప్పింది మోనిక.

"ఓ మోనీ.. యూ ఆర్ కిల్లింగ్ విత్ యువర్ వర్డ్స్!" అంటూ ఒంటి మీద ఆచ్ఛాదనలూ ఏమీ లేకుండా తయారయ్యాడు రిషి.

"దట్స్ గ్రేట్ రిషి.. నవ్ టర్న్ బ్యాక్ అండ్ స్పీడాన్ దట్ టీవి! రిమోట్ ఎదురుగానే ఉంది."

"ఓహ్ టీవీ?!! మోనీ.. యూఆర్ టూ హాట్.. వీడియోలు చూస్తూనా.. దట్స్ రియల్లీ ఏ వెరీ హాట్ ఐడియా!" వెనక్కి తిరిగి రిమోట్ తీసుకుని ఆన్ చేస్తూ చెప్పాడు రిషి.

"యస్ ఆయాం రిషి.. గో అహెడ్!" చెప్పింది మోనిక.

టీవీ ఆన్ చేసిన కొన్ని క్షణాలకు తెరమీద బొమ్మ ప్రత్యక్షమయింది. దాన్ని చూసి నివ్వెరపోయాడు రిషి... హే ఇట్స్ మీ.. వాట్స్ ద హెల్ గోయింగ్ ఆన్. ఇట్స్ ఏ చానెల్.. ట్రూత్ టీవీ.. మోనికా యూ ఇడియట్.. స్టుపిడ్.. ఏమై గాడ్ ఇట్స్ లైవ్... హే!" రెండుచేతులతో కవర్ చేసుకుంటూ కోపంగా మోనిక మీదకు దూసుకొచ్చాడు రిషి.

"కూల్ కూల్.. రిషి.. యూ షుడ్ మీ అవేరాఫ్ ది ట్రూత్ టీవీ! మోరోవర్ ఇట్స్ లైవ్ అండ్ యూ ఆర్ నేకెడ్!" నవ్వుతూ చెప్పింది మోనికా.

ఒక్కసారి నిస్సత్తువ ఆవహించింది రిషిని. అయినా అతి కష్టం మీద గొంతు పెగుల్చుకుని చెప్పాడు "ఇంత షేం అయ్యాక నేను చచ్చినా ఫర్వాలేదు. కానీ నువ్ బ్రతక్కూడదే!" అంటూ మోనిక దగ్గరకు మళ్ళీ రాబోయాడు రిషి.

"నన్ను నువ్ కొంచెం తాకినా తలుపు తోసుకుని రావడానికి పోలీసులు బైట రెడీగా ఉన్నారు రిషి. ఇపుడు నువ్వేమీ చెయ్యలేవ్. ముందు బట్టలేసుకో. అన్నట్లు నీకో గుడ్ న్యూస్! మన సీయీఓ కూడా ఈ ప్రోగ్రాంని లైవ్‌లో చూస్తున్నారు. నీ వైఫ్ కూడా!! అమ్మాయిలంటే అంత చీప్‌గా కనిపిస్తున్నారా రిషీ నీకు? నువ్వే కాదు దీన్ని చూసిన ఎవడూ కూడా ఇక ముందు ఇలా బిహేవ్ చేసే ధైర్యం చెయ్యడు!!"చెప్పింది మోనిక.

ఒక్కసారిగా పెద్ద పెట్టున రోదిస్తున్నాడు రిషి. ఏడుస్తూనే బట్టలు వేసుకున్నాడు. మోనిక లేచి వెళ్ళి తలుపు తీసింది. పోలీసులు బేడీలు వేసి రిషిని తీసుకెళ్ళారు.

ట్రూత్ టీవీలో "మోనికా వెల్‌డన్!" "మోనికా.. డేరింగ్ గాళ్"లాంటి ప్రశంసలెన్నో కింద స్క్రోల్ అవుతున్నాయి.

హిడెన్ కెమెరాలేవీ మొబైల్ ఫోన్ కంటికి కూడా అందకుండా చేసే సాఫ్ట్‌వేర్‌ను మూడు రోజుల్లో తయారు చేయగలిగినందుకు ఆ క్షణంలో గర్వపడింది మోనిక.

"మోనికా మేడం.. గ్రేట్ జాబ్ మాకూ మిమ్మల్ని ఇంటర్వ్యూ చేసేందుకు బైట సిద్దంగా ఉంది. రమ్మంటారా?" ట్రూత్ టీవీ యాంకర్ ఫోన్లో అడుగుతోంది.

"ష్యూర్. పంపించండి" చెప్పింది మోనిక నవ్వుతూ.

ఇదంతా చేసింది తనే అంటే ఆమెకే ఇంకా నమ్మశక్యంగా లేదు. నిజమేనే మోనికా.. యూ ఇడియట్" అంటూ రిషినే తలుచుకుంటూ సర్దిచెబుతోంది ఆమె మనసు!! ◆

వ్యాసం

# శివసేన దుశ్చర్య

- వేములపల్లి సత్యవతి

శివసేన కార్యకర్తలు సుధీంద్ర కులకర్ణికి నల్లసిరా పూశారు. 12-10-15న పుస్తకావిష్కరణకు వెళుతున్న కులకర్ణి కారును దారిలో అడ్డగించి ఆయన ముఖానికి నల్లసిరా పులిమి వదిలేశారు. దానికి ముఖ్యకారణం ఆ గ్రంధ రచయిత పాకిస్థాన్‌కు చెందిన ముస్లిం అవటం. ముస్లిం రచయిత పాకిస్థాన్‌లో లోగడ విదేశాంగశాఖ మాజీ ముఖ్యమంత్రి ఖుర్షీద్ మహమూద్ కస్తూరి. ఆ గ్రంధం పేరు "నెదర్ ఎ నాక్‌హార్ ఏడన్" దాని ఆవిష్కరణ ముంబయిలో సుధీంద్ర కులకర్ణి చేతులమీదుగా జరపదలచారు. ఈ విషయం తెలిసి శివసేన నాయకుడు ఉద్ధవ్ ఠాకరే కులకర్ణిని ఆ పని విరమించుకొమ్మని నిరసన తెలిపారు. దానికి సమాధానం " మా కార్యక్రమం ఆగదు. నిరసన తెలపటం వారి హక్కుగా భావిస్తున్నట్లే గ్రంథావిష్కరణ హక్కు నాకూ ఉన్నదని, దీనిని మీరు గౌరవించాలని కోరుతున్నాను" అని ఉద్ధవ్ ఠాక్రేకు సుధీంద్ర కులకర్ణి ఫోను చేసి చెప్పారు. చెప్పినట్లుగానే శివసేన నిరసనలను లెక్కచేయకుండ సవాల్‌గా స్వీకరించి తన నాయకత్వంలోని అబ్జర్వర్ రిసెర్చ్ ఫౌండేషన్ ఇతర సంస్థల నిర్వాహకుల ఆధ్వర్యాన, కట్టుదిట్టమైన భద్రత నడుమ పుస్తకావిష్కరణ కార్యాన్ని అత్యంత సమర్ధవంతంగా దిగ్విజయంగా పూర్తిచేశారు. ఆ భద్రతా ఏర్పాట్లను అధిగమించి వేదిక మీద సుధీంద్రను





అవమానించటం సాధ్యంకాదని గ్రహించి, కారులో కార్యక్రమానికి వస్తున్న కులకర్ణిగారిని దారిలో అడ్డగించి వారి ముఖానికి మసిపూసినట్లుగా నల్ల సిరాను ఇష్టమొచ్చినట్లుగా పులిమారు.

కులకర్ణిగారు నల్లసిరా పూయబడిన ముఖంతోనే వేదిక దగ్గరకు చేరుకుని, నిస్సంకోచంగా గ్రంధావిష్కరణ చేశారు. ప్రజాస్వామ్యంలో నిరసన వ్యక్తం చేసే భాగంలో నల్లసిరా పూయటం కూడ భాగమేనని తాను చేసిన అనాగరిక చర్యను సమర్ధించుకుంది శివసేన. సుధీంద్ర పోలీసులకు రిపోర్టు చేశారు. పోలీసులు కేసును నమోదు చేసుకుని ఆరుగురిని అరెస్టు చేశారు. శివసేన దుశ్చర్యను అన్ని పార్టీల నాయకులు ముక్తకంఠంతో ఖండించారు. బిజెపి అగ్రనేత అద్వాని ఆవేదన వ్యక్తం చేశారు. శివసేనను దేశీయ తాలిబనుల మూక అని. ఉద్ధవ్ ఠాక్రే తన గూండాలను అదుపులో పెట్టుకోవాలని కాంగ్రెస్ ప్రధాన

**శివసేన చేసిన హేయమైన పని ఇదొక్కటేకాదు ఇదే మొదలు కాదు. ఇండో పాకిస్థాన్ క్రికెట్ ఆటను రద్దు చేయాలని నానా రభస చేసి ఆందోళన మొదలెట్టింది. అందుకు నిరసనగా ముంబయిలోని 'వాంఖడే' క్రికెట్ పిచ్‌ను త్రవ్వి కుప్పలు కుప్పలుగా పోసింది. దక్షిణ భారతీయులు ముంబయి విడిచి వెళ్ళిపోవాలని నానాయాగి చేసింది. అరాచక చర్యలకు పూనుకుంది.**

కార్యదర్శి దిగ్విజయ్‌సింగ్ ప్రకటించారు. మోదీ పాలనలో 'మేక్ ఇన్ ఇండియా' కాస్తా 'బేకింగ్ ఇండియా' గా మారుతున్నదని సిపియం అగ్ర నాయకురాలు బృందాకారత్ తెలిపారు. ఈ సంఘటన సిగ్గుచేటని సినీరంగ ప్రముఖులు షబనా అజ్మీ, మహేష్‌భట్, సోనా పాత్ర వెల్లడించారు. ఈ ఘటన వెనుక ఆర్‌ఎస్‌ఎస్ హస్తమున్నదని సిపిఐ ప్రముఖ నేత రాజా తెలియజేశారు.

శివసేన చేసిన హేయమైన పని

ఇదొక్కటేకాదు ఇదే మొదలు కాదు. ఇండో పాకిస్థాన్ క్రికెట్ ఆటను రద్దు చేయాలని నానా రభస చేసి ఆందోళన మొదలెట్టింది. అందుకు నిరసనగా ముంబయిలోని 'వాంఖడే' క్రికెట్ పిచ్‌ను త్రవ్వి కుప్పలు కుప్పలుగా పోసింది. దక్షిణ భారతీయులు ముంబయి విడిచి వెళ్ళిపోవాలని నానాయాగి చేసింది. అరాచక చర్యలకు పూనుకుంది. బీహారీలు, గుజరాతీలు, మార్వాడీలు, ఇతర రాష్ట్రాలకు చెందిన ముంబయిలో ఉన్నవారు శివసేన కార్యకర్తల వలన నానా బాధలు పడ్డారు. గులాం అలీ మన దేశంలో పేరుగాంచిన గజల్ విద్యాంసుడు. ఆయన గజల్ కచేరీని ముంబయిలో జరపాలను కున్నారు. కానీ ఆషాడభూతిలాగా శివసేన అడ్డు తగిలింది. గులాం అలీ గజల్ కచేరీని తమ రాష్ట్రంలో జరపాలంటే, తమ రాష్ట్రంలోనే జరుపుతామని ఢిల్లీతో సహా ముందుకొచ్చాయి. శివసేన రాజ్యసభ సభ్యుడు ఒకరు ముస్లింలకు ఓటు హక్కును రద్దు చేయాలని ప్రకటన చేశాడు. ముస్లిం వ్యతిరేకతే ప్రధాన లక్ష్యంగా ఉన్న శివసేన నేతలకు పాకిస్థాన్ వ్యవస్థాపకుడు కాయదే ఆజంజిన్నా ఆ దేశపు రాజ్యాంగాన్ని ఉర్దూ భాషలో లబ్ద ప్రతిష్టుడయిన ఒక హిందూ కవితో రాయించాడన్న సంగతి తెలియదనుకుంట. పూర్వం నుంచి భారత్‌లో విభిన్న మతాలవారు, వేరు వేరు భాషలవారు, భిన్న సంస్కృతికి చెందినవారు నివసిస్తున్నారు.

1947 ఆగష్టు 15 స్వాతంత్ర దినోత్సవాన్ని నిజాం నవాబ్ తన సంస్థానంలో నిషేధించాడు. అయినా ప్రజలు గ్రామాలలో త్రివర్ణ పతాకాన్ని ఎగరవేసి ఆగస్టు 15 ఉత్సవాన్ని అత్యంత ఉత్సాహంగా జరుపుకున్నారు. రాజధాని హైదరాబాద్‌లో గ్రామాలలోలాగా జరుపుకునే అవకాశంలేదు. పోలీసు బందోబస్తు పకడ్బందీగా వుంటుంది. 144 సెక్షన్ అమలు పరిచే దశ వుంటుంది. విద్యార్థులు సంఘం ఎ.హెచ్.ఎస్.యు సహాయ కార్యదర్శి రఫీ అహమ్మద్ అభ్యుదయ భావాలుగల విద్యార్థి, విద్యార్థుల యూనియన్ కార్యాలయంపై రఫీ అహమ్మద్ త్రివర్ణ పతాకాన్ని ఎగురవేశాడు. మత,జాతుల మధ్య ద్వేషాన్ని పెంచి పోషిస్తున్న శివసేనకు ఇవన్నీ కనిపించవా? శివసేన ఆగడాలను భవిష్యత్‌లో జరుగనివ్వకుండ అడ్డుకట్ట వేయడానికి సామాజిక శ్రేయోభిలాషులందరూ ఏకం కావాలి. ◆

## దాచిన చిత్రం

నేనొక దాచిన చిత్రాన్ని
ఫైల్ ఫోటో నా ముద్దు పేరు
నేనో నిర్జీవ పదార్థాన్నిప్పుడు
జీవితాన్ని జీవాన్ని
నా నుండి వేరుచేశారంతే

నా వెనుక దాగిన జీవితం
నేనెందుకలా చిత్రాన్నయ్యానో
చెప్పకనే చెబుతుంది
పెళ్ళి చూపులకో
పరీక్ష రాయటానికో
బాగా అలంకరించుకుని
తీసుకున్న నా చిత్రం
ఇంట్లో వారందరినీ
అలరించి మురిపించి
సందడి చేసింది
అదంతా అందమైన గతం

నాపై ఇప్పుడు
కన్నీటి బిందువులు
జల జలా రాలుతున్నాయి

నా బొమ్మకు లాగే
నా మరణమూ దాచేయబడింది.
వాంగ్మూలాలు స్థానభ్రంసమయ్యాయి

న్యాయదేవత గదిలో
మూలాలన్నీ తిరుగుతోంది సత్యం
ఎవ్వరికీ అందకుండా
న్యాయాన్నీ అన్యాయాన్నీ
త్రాసు మోస్తోంది
లోలకంలా సమ దృష్టితో
అటూ ఇటూ తిరుగుతోంది

భౌతికంగా నను
ఈ లోకాన్నుండి
అతి క్రూరంగా వేరుచేసి
వికటాట్టహాసం చేస్తున్న
వారి చిత్రంలోనే
నన్నో మూలకి కుదించి
ఓ వృత్తంలో బంధించి
నా వారి గుండెల్లో
శూలాలు దింపటం
నిత్యకృత్యమైపోయింది

నేనో దాచిన చిత్రాన్ని
జీవంగానైనా
నిర్జీవంగానైనా
ఏమీ చేయలేని చరిత్రని

- జంధ్యాల రఘుబాబు

# మహిళల పౌష్టికతతోనే ఆర్థికాభివృద్ధి సాధ్యం

- డా॥ కె. పద్మ

చైనా తరువాత ప్రపంచంలోనే అతి త్వరగా అభివృద్ధి చెందుతున్న దేశంగా భారతదేశం గుర్తింపు పొందింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థను ప్రభావితం చేయగల దేశంగా పేరుగాంచింది. భారతదేశంలో ఉన్న మానవ వనరులను సమర్థవంతంగా ఉపయోగించుకుంటే ఇది సాధ్యమే. మన దేశంలో మొత్తం జనాభాలో 63.4 శాతం జనాభా పనిచేయగల వయస్సులో ఉన్న జనాభా (15-64 సంవత్సరాలు). 65 శాతం పైబడి 35 సంవత్సరాల కంటే తక్కువ వయస్సులో ఉన్న జనాభా మన దేశంలో ఉంది. ఈ యువతను దేశం సంపూర్ణంగాను మరియు సమర్థవంతంగాను ఉపయోగించుకోవడం ద్వారా మరింత ఎక్కువ ఫలాలను పొందవచ్చును. వీరిని సమర్థవంతంగా ఉపయోగించుకోవడం అన్నది వారి ఆరోగ్యం, విద్య మరియు నైపుణ్యాల మీద ఆధారపడి ఉంటుంది. ఆరోగ్యం మరియు విద్య అనేవి మహిళల విషయంలో మరింత ఎక్కువ ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. మహిళలు యువతలో సగ భాగంగా ఉన్నారు. వీరు ఉత్పాదక ఉద్యోగితలో పాల్గొనడం ద్వారా త్వరగా అభివృద్ధిని సాధించడం సాధ్యమవుతుంది.



భారతదేశం సంతృప్తికరమైన వృద్ధి రేటును నమోదు చేసుకున్నప్పటికీ, ఈ అభివృద్ధి అందరినీ, ముఖ్యంగా మహిళలను మరియు పిల్లలను కలుపుకునిపోయే అభివృద్ధిగా లేదు. మానవాభివృద్ధిలో భారతదేశం సాధించిన ప్రగతి అత్యంత నిరాశాజనకంగా ఉంది. 2014 ఐక్యరాజ్యసమితి (యునైటెడ్‌నేషన్స్) మానవాభివృద్ధి నివేదిక ప్రకారం భారతదేశం మొత్తం 186 దేశాలకు గాను 135వ స్థానంలో ఉంది.

భారతదేశంలో మహిళల పౌష్టికతకు సంబంధించిన గణాంకాలు ఆశాజనకంగా లేవు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దీనికి భిన్నంగా లేనప్పటికీ భారతదేశంతో పోల్చినప్పుడు బి.ఎం.ఐ పరంగా మెరుగుగా ఉంది. అయితే కేరళ, తమిళనాడు లాంటి రాష్ట్రాలతో పోల్చినప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మహిళల పౌష్టికత విషయంలో వెనుకబడివుంది. పౌష్టికాహారలేమిని రెండు విధాలుగా అంచనా వేయవచ్చు. 1. బాడీ మాస్ ఇండిక్స్‌ని అంచనా వేయడం (బి.ఎం.ఐ) 2. రక్త నమూనాలో హెమోగ్లోబిన్‌ని అంచనా వేయడం. బి.ఎం.ఐ. పద్ధతిలో వ్యక్తి బరువు, ఎత్తులను పరిగణనలోకి తీసుకొని (బి.ఎం.ఐ= బరువు/ఎత్తు2) అనే సూత్రం ఉపయోగించి అంచనా వేస్తారు. బరువు కిలోలలోను, ఎత్తుని మీటర్లలోను కొలవడం జరుగుతుంది. రెండో పద్ధతిలో రక్త నమూనాలలో హెమోగ్లోబిన్‌ను అంచనా వేస్తారు.

బి.ఎం.ఐ ని బట్టి వ్యక్తులను 3 తరగతులుగా విభజించవచ్చు. అవి 1.) 18.5లోపు, 2) 18.5-24.9 మధ్య, 3) 25పైన. మన దేశంలో జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే-3 (ఎన్.ఎఫ్.హెచ్.ఎస్-3) అంచనాల ప్రకారం 51.8 శాతం మహిళలు 18.5.-24.9 మధ్య బి.ఎం.ఐ ని కలిగి ఉన్నారు. మహిళల సగటు బి.ఎం.ఐ 20.5గా ఉంది. భారతదేశంలో 35.6 శాతం మహిళలు 18.5 కన్నా తక్కువ బి.ఎం.ఐ ని కలిగి ఉన్నారు. వీరిలో 19.7 శాతం మంది 17.0 - 18.4 మధ్య బి.ఎం.ఐ ని కలిగి ఉన్నారు. 15.8 శాతం మహిళలు 17.0 కన్నా తక్కువ బి.ఎం.ఐ.ని కలిగి ఉన్నారు. అంటేవీరు

వారి వయసుస్సుకు తగిన బరువు, ఎత్తులేరని తెలున్నుంది. వారి ఎదుగుదలలో లోపానికి ప్రధాన కారణం పౌష్టికాహారలేమి.

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో సగటు బి.ఎం.ఐ. 20.9గా ఉంది. 50.9 శాతం మహిళలు సహజ బి.ఎం.ఐ.ని కలిగి ఉన్నారు. (18.5-24.9). 33.5శాతం మహిళలు 18.5కన్నా తక్కువ బి.ఎం.ఐ.ని కలిగి ఉన్నారు. వారిలో 17.8శాతం మంది బి.ఎం.ఐ. 17.0-18.4 మధ్య ఉండగా 15.6 శాతంమంది బి.ఎం.ఐ.17.0 కన్నా తక్కువగా ఉంది. కేరళ, తమిళనాడు రాష్ట్రాలలో 17.0-18.4మధ్య బి.ఎం.ఐ. ఉన్న వారు కేరళ, తమిళనాడు రాష్ట్రాలలో క్రమంగా 84 మరియు 13.5శాతంగా ఉన్నారు. దీనిని బట్టి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో మహిళలు కేరళ, తమిళనాడు రాష్ట్రాలలో మహిళల కంటే ఎక్కువ శాతం పౌష్టికాహారలేమితో బాధపడుతున్నారన్న సంగతి తెలుస్తుంది.

ఆరోగ్యానికి మరో కొలమానం రక్తనమూనాలను పరీక్షించి హెమోగ్లోబిన్ శాతం తెలుసుకోవడం. 12 శాతం కన్నా తక్కువ హెమోగ్లోబిన్ ఉన్నట్లయితే మహిళలు ఏదో ఒకరకమైన రక్తహీనతతో బాధపడుతున్నట్లుగా చెప్పవచ్చును. రక్తహీనతను 3 రకాలుగా వర్గీకరించడం జరిగింది. హెమోగ్లోబిన్ శాతం మహిళలలో 10.0-11.9 మధ్య ఉన్నట్లయితే మైల్డ్ (ఎక్కువ) రక్తహీనత కలిగి ఉన్నట్లుగాను, 7.0-9.9 మధ్య ఉన్నట్లయితే మోడరేట్ (అతి ఎక్కువ) రక్తహీనత కలిగి ఉన్నట్లుగానను, 7.0 కన్నా తక్కువ ఉన్నట్లయితే తీవ్ర రక్తహీనత కలిగి ఉన్నట్లు చెప్పడం జరిగింది. ఈ కొలమానం ప్రకారం భారతదేశంలో ఎన్.ఎఫ్.హెచ్.ఎస్-3 గణాంకాల ప్రకారం 38.6 శాతం మహిళలు మైల్డ్ రక్తహీనతతో బాధపడుతుండగా, 15.0శాతం మహిళలు మోడరేట్ రక్తహీనతతోను, 1.8శాతం మంది మహిళలు తీవ్ర రక్తహీనతతో బాధపడుతున్నారు. 55.3 శాతం మహిళలు రక్తహీనతతో బాధపడుతున్నారు.

రక్తహీనతని పరిగణలోనికి తీసుకుని మహిళల ఆరోగ్యం అంచనా వేసినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లోని మహిళల ఆరోగ్యం భారతదేశంలోని మహిళల ఆరోగ్యం కన్నా మెరుగుగా లేదు. ఆంధ్రప్రదేశ్‌లో 39.6 శాతం మహిళలు మైల్డ్ రక్తహీనతతతోను, 20.6 శాతం మోడరేట్ రక్తహీనతతోనూ, 3.3 శాతం మంది మహిళలు తీవ్ర రక్తహీనతతో బాధపడుతున్నారు. 62.9 మంది మహిళలు ఆంధ్రప్రదేశ్‌లో ఏదో రకమైన రక్తహీనతతో బాధపడుతున్నారు. దక్షిణాది రాష్ట్రాలతో పోల్చినప్పుడు (కేరళ, కర్ణాటక మరియు తమిళనాడు) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే మహిళలు ఎక్కువశాతం రక్తహీనతతో బాధపడుతున్నారు.

మహిళలలో తక్కువ బరువు మరియు రక్తహీనత పౌష్టికాహారలేమిని తెలియజేస్తుంది. పౌష్టికాహారలేమి మహిళలకు ప్రసవ సమయంలో అనేక ఇబ్బందులను కలుగజేస్తుంది. ప్రసవ సమయంలో నొప్పులు భరించే శక్తిని క్షీణింపజేస్తుంది. పౌష్టికాహారలేమి కారణంగా అనేక మంది బాలింతలు చనిపోతున్నారు. బాలింత మరణాలలో 20 నుంచి 40 శాతం వరకు మరణాలకు పౌష్టికాహారలేమి యే ప్రధాన కారణం. పౌష్టికాహారలేమి కారణంగా బాలింతలు అనేక రకాల ఇన్ఫెక్షన్స్ బారినపడే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. చనిపోయిన పిల్లలు పుట్టడం, పుట్టిన కొద్ది రోజుల్లోనే పిల్లలు చనిపోవడం, తక్కువ బరువుతో పుట్టడం, అసహజంగా పుట్టడం లాంటి వాటికి ప్రధాన కారణం మహిళలలో పౌష్టికాహారలోపం.

**భారతదేశం సంతృప్తికరమైన వృద్ధి రేటును నమోదు చేసుకున్నప్పటికీ, ఈ అభివృద్ధి అందరినీ, ముఖ్యంగా మహిళలను మరియు పిల్లలను కలుపుకునిపోయే అభివృద్ధిగా లేదు. మానవాభివృద్ధిలో భారతదేశం సాధించిన ప్రగతి అత్యంత నిరాశాజనకంగా ఉంది. *2014* ఐక్యరాజ్యసమితి (యునైటెడ్‌నేషన్స్) మానవాభివృద్ధి నివేదిక ప్రకారం భారతదేశం మొత్తం *186* దేశాలకు గాను *135*వ స్థానంలో ఉంది.**

యునిసెఫ్ అంచనాల ప్రకారం ఏడాదికి ప్రపంచ వ్యాప్తంగా 20 మిలియన్ల నవ శిశువులు తక్కువ బరువుతో జన్మిస్తున్నారు. వారిలో సగం కంటే ఎక్కువ మంది భారతదేశం, పాకిస్తాన్. నైజీరియా, ఫిలిఫైన్స్ మరియు చైనా దేశాలలో జన్మినస్తున్నారు. భారతదేశంలో ఏడాదికి 75 లక్షల మంది నవ శిశువులు తక్కువ బరువుతో జన్మిస్తున్నారు.

మహిళలలో పౌష్టికాహారలేమి వారి ఆరోగ్యం, పునరుత్పత్తి సామర్థ్యం, పిల్లల అభివృద్ధి పైనే కాకుండా భావితరాల ఆరోగ్యం మరియు భావితరాల తల్లుల ఆరోగ్యం పైన కూడా

ప్రభావం చూపుతుంది. పౌష్టికాహారలేమి మహిళల ఉత్పాదక సామర్థ్యం పైన, తద్వారా వారి ఆదాయం మరియు వారి కుటుంబ ఆదాయాల పైన ప్రభావం చూపుతుంది. మహిళలలో పౌష్టికాహార లేమి వారికి నష్టం చేయడమే కాకుండా వారి ఉత్పాదక సమర్థతను మరియు భవిష్యత్ తరాల ఉత్పాదక సమర్థతను తగ్గించడం ద్వారా పరోక్షంగా దేశ ప్రగతిని కుంటుపరుస్తుంది. కనుక మహిళలలో పౌష్టికాహారలేమిని తగ్గించాల్సిన అవసరం ఉంది.

ప్రజల ఆరోగ్యం కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వాలపై ఉంది. కనుక ప్రభుత్వాలు తగు చర్యలు తీసుకోవలసి ఉంది. కాని సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలు అవలంభించిన తరువాత మన ప్రభుత్వాలు తమ బాధ్యతల నుంచి వైదొలగి ప్రైవేటు వారికి అప్పజెప్పడం జరుగుతోంది. ఇందులో భాగంగానే ఐ.సి.డి.ఎస్ (సమగ్ర శిశు సంక్షేమశాఖ)ని కూడా ప్రైవేట్‌పరం చేయాలని ప్రయత్నం చూస్తోంది. కానీ మహిళల సమర్థత, పౌష్టికత మెరుగుపడాలంటే దిగువ చర్యలను చేపట్టాలి.

1. నాణ్యమైన విద్యను ప్రభుత్వాలు అందించాలి. 2. ఉపాధి అవకాశాలు మెరుగుపడాలి. 3. కనీస వేతనాలు అమలు చేయాలి. వేతన వ్యత్యాసాలుండకూడదు. (స్త్రీ, పురుషుల మధ్య) 4. ప్రభుత్వ ఆసుపత్రులను బలోపేతం చేయాలి.
5. ఐ.సి.డి.ఎస్.ని సమర్థవంతంగా నిర్వహించాలి. 6. అంగన్‌వాడీ సెంటర్లను పెంచాలి.

**(రచయిత అసోసియేట్ ప్రొఫెసర్, విశాఖ ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల)**◆

# జోహార్లు ద్రోణవల్లి అనసూయ

**1930**లో కృష్ణాజిల్లా మేడూరులో మధ్య తరగతి రైతు కుటుంబంలో ద్రోణవల్లి అనసూయ పుట్టారు. మిడిల్ స్కూల్ వరకూ చదివేందుకు ఇంట్లోఎంతో పోరాటం చేయవలసివచ్చింది. వామపక్ష భావజాల ప్రభావంవల్ల చిన్న వయసునుంచే మహిళా ఉద్యమంపట్ల ఆకర్షితులై మానికొండ సూర్యావతి, లక్ష్మి కాంతమ్మ వంటి వాళ్ళతోపాటు గ్రామాలు తిరగటం మహిళలను పోగెయ్యటం, పాటలు పాడటం వంటివి చేసేవారు. మహిళలను పోగేసి పత్రికలు చదివి రాజకీయాలు చెప్పేవారు. ప్రజాశక్తిలో వచ్చిన నినాదాలను వాకిట్లో ముగ్గులుగా అనసూయమ్మ చెల్లితో కలిసి వేసేది. ఆముగ్గు చూసిన సత్యప్రసాద్ గారు తన లక్ష్యానికి సహకరించే భాగస్వామిగా భావించి ఇంట్లో ఒప్పించి వివాహం చేసుకున్నారు. కుల మత బేధాలు పాటించక సహపంక్తి భోజనాలు పెట్టారు. చల్లపల్లి జమిందారుకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో అనసూయ పాల్గొన్నారు. ఆ తరువాత తెలంగాణాలో సాయుధ పోరాటం చేస్తున్న కామ్రేడ్స్‌కు సహకరించడం, షెల్టర్ ఇవ్వటం వంటి వాటిలో చురుకైన పాత్ర వహించారు. 16 రోజుల చంటి బిడ్డ తల్లై ఉండి మహిళా సభల నిషేధానికి వ్యతిరేకంగా మహిళాసంఘం జరిపిన ఊరేగింపులో పాల్గొన్నారు. పోలీసులు మహిళల్ని చుట్టుముట్టి అనసూయగారి చేతిలో వున్న బాబును లాక్కొని విసిరి వేశారు. కామ్రేడ్స్ కింద పడకుండా పట్టుకున్నారు. పోలీసులు అరెస్టు చేసి కస్టడీలో కొనసాగించే ప్రయత్నంలో రహస్య జీవితంలోకి వెళ్ళిపోయారు. రహస్యంగా వుంటూ నిక్కరు, షర్టు వేసుకుని అర్ధరాత్రి కూడా తిరిగేది. భార్యా భర్తలు ఇద్దరూ రహస్యంగా పనిచేయటంతో వారి భూముల్లో పంటలను జప్తు చేసింది.

సాయుధ దళాల ఏర్పాటు నేపథ్యంలో సగభాగమైన ఆడవాళ్ళను కూడా దళాల్లో తీసుకోవాలని కొట్లాడి ఆంధ్రాలో మొదటి సాయుధ దళ సభ్యురాలైంది. దళంలో కష్టాల్ని అధిగమించి పని చేయుటమే కాక ఎగురుకుంటూ ఆడవాళ్ళు కూడా దళాల్లోకి వస్తారంటూ హేళనలను ఎదుర్కొని, తామేమీ తక్కువ కాదని రుజువు చేసుకున్నారు . భర్త సత్యప్రసాద్ ఎన్‌కౌంటర్ గురయి చనిపోయినా ఎర్రజెండాను భుజంమీద నుండి దించకుండా ప్రయాణించాలని చేసుకున్న ప్రమాణాన్ని జీవితకాలం పాటించారు.

1952 ఎన్నికలలో పోటీ చేయించాలని పార్టీ నిర్ణయించినా ఆమెకు వయసు సరిపోలేదు. సైకిల్ నేర్చుకొని గ్రామాలు తిరుగుతూ రైతు సమస్యలు, మహిళా సమస్యలను పరిష్కరిస్తూ పార్టీలో పనిచేశారు. 1984 తరువాత ఎమ్‌ఎల్ పార్టీలో భూ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. జైలు జీవితాన్ని గడిపారు. చివరి వరకు రాజకీయాలే ప్రధాన భాగంగా జీవించారు. నవంబరు 5న మరణించారు. ఆమె మృతికి ఐద్వా రాష్ట్రకమిటీ, మానవి ఎడిటోరియల్ బోర్డు అనసూయగార్కి జోహార్లు అర్పిస్తోంది. ◆

## సీరియల్ పశ్చిమ వర్జీనియాలో యుద్ధం- మరో అమ్మ ( మేరీ జోన్స్ ఆత్మకథ)

నేనుమరో నాయకుడు స్కాట్ కలిసి ఒక రాత్రిపూట ఫైర్‌మౌంట్ జిల్లాలో ఉన్న మైనింగ్‌టౌన్‌కు కార్మికులను సమావేశపర్చేందుకు వెళ్ళాము. ఒక భవంతి ముందు మేము కారు దిగాము. ఆ భవనం ఒక చర్చి భవనం. దానిలో క్రొవ్వొత్తులు వెలిగించారు. ఆ మసక వెలుతురులో అందర్నీ చూశాను. బెంచీలన్నీ గని కార్మికులతో నిండి ఉన్నాయి.

చర్చిలో దైవపీఠం అంచున టేబుల్ ఉంది. టేబుల్‌కి ఒక చివర స్థానిక యూనియన్ అధ్యక్షుడు కూర్చున్నాడు. నేను పక్కగదిలోకి వెళ్ళాను.

'ఏమి జరుగుతోందని' అడిగాను.

'మీటింగ్ పెట్టాలనుకుంటున్నామని' అధ్యక్షుడన్నాడు.

'ఎందుకోసమని' అడిగాను.

'అమ్మా! యూనియన్ కోసం. మేము మన మీటింగ్ కోసం చర్చిని అద్దెకు తీసుకున్నామని' చెప్పాడు.

నేను పూజారి దగ్గరకు వెళ్ళి కార్మికులు ఇచ్చిన డబ్బులు తిరిగి తీసుకున్నాను. కార్మికులవైపు తిరిగి

'అబ్బాయిలూ! ఇది ప్రార్ధనాస్థలం. దీనిని వ్యాపారమయం చెయ్యొద్దు. అందరూ లేవండి. బయటకు వెళదామని' చెప్పాను.

వాళ్ళంతా లేచి ఆరుబయట పొలాల్లో కూర్చున్నారు. నేను వాళ్ళతో మాట్లాడాను. అక్కడకి వచ్చిన ఓ అధికారి నేను మాట్లాడుతున్నంతసేపు ఇటువైపు జనం రాకపోకలు లేకుండా, మీటింగుకు అంతరాయం కలగకుండా చూశాడు. మా ముందు ఒక పాఠశాల వుంది. దాన్ని చూపించి, "ఈ పాఠశాల మనది. మన పూర్వీకులు ఈ పాఠశాలలో వాటా కోసం పోరాడారు. పాఠశాల పేరు చూడండి. ప్రతీ శుక్రవారం రాత్రి ఇక్కడ మీటింగ్ పెట్టుకోండి, శనివారం ఉదయం మీ భార్యలను శుభ్రం చేయమనండి. సోమవారం బడిపిల్లలు వచ్చేందుకు ఇబ్బంది ఉండదు. మన యూనియన్ ప్రార్ధించేది కాదు. పోరాడే సంస్థ, పారిశ్రామిక విధానాల గురించి బోధించే సంస్థ. చనిపోయిన వాళ్ళకోసం ప్రార్ధించండి. భయంకరంగా వున్న బ్రతుకుల్లో మార్పుకోసం అంతే భయంకరంగా పోరాడండి" అని చెప్పాను.



ఫైర్‌మౌంట్ ఫీల్డ్స్ బాధ్యునిగా టామ్ హగ్గర్టీ ఉన్నాడు. ఒక ఆదివారం ఉదయం క్లార్ప్‌బర్గ్‌లో సమ్మె చేస్తున్న కార్మికులు మనోన్‌గ్లియాకు ప్రదర్శనగా బయలుదేరారు. ఈ దారిలో వచ్చిన అన్ని క్యాంపుల్లోని కార్మికులను సమ్మెలోకి దించడంకోసం ఈ ప్రదర్శన తీశారు. మేము ఆరుబయట పొలాలలోనే ఉన్నాము. రోడ్డు ప్రక్కనే మీటింగులు పెట్టి యూనియన్‌లో చేరమని ప్రోత్సహించాము.

**కార్మికులు చాలామంది అజ్ఞాతంలోకి వెళ్ళి ఇద్దరిద్దరుగా విడిపోయారు. ఇద్దరిలో ఒకరు చెవిటివానిగా నటించేవాడు. అతనితో గట్టిగా, అందరికి వినిపించేటట్టు రెండవ వ్యక్తి మాట్లాడేవాడు. వీరిద్దరూ ఈ విధంగా మాట్లాడుకుంటూ కలియతిరిగారు. ఏమనంటే "ఆదివారం మధ్యాహ్నం నగర శివారులలో ఉన్న రంపపుపొడి కుప్పవద్ద మదర్ జోన్స్ మీటింగు పెడుతున్నారు" అని, చెవిటివాడు నాకు వినబడలేదు, మళ్ళీచెప్పమని అడిగేవాడు. రెండవ వ్యక్తి గట్టిగా అరుస్తూ సమాధానం చెప్పేవాడు. ఈ విధంగా మొత్తం కార్మికుల్లోకి మీటింగు పెడుతున్న కబురువెళ్ళింది.**

న్యూ ఇంగ్లాండ్ అనే చిన్నపట్టణం కోల్ కంపెనీ వాళ్ళది. ఈ పట్టణంలో కంపెనీ యాజమాన్యం కార్మికులకు యూనియన్ ఇచ్చే మీటింగు నోటీసులను నిషేధించింది. ఎవరి దగ్గరైనా నోటీసులు ఉంటే అరెస్టులు చేయించేది. అయితే మాకు ఎప్పటికప్పుడు సమాచారం అందేది. ఈ స్థితిలో మేమొక ఉపాయం ఆలోచించాము. కార్మికులు చాలామంది అజ్ఞాతంలోకి వెళ్ళి ఇద్దరిద్దరుగా విడిపోయారు. ఇద్దరిలో ఒకరు చెవిటివానిగా నటించేవాడు. అతనితో గట్టిగా, అందరికి వినిపించేటట్టు రెండవ వ్యక్తి మాట్లాడేవాడు. వీరిద్దరూ ఈ విధంగా మాట్లాడుకుంటూ కలియతిరిగారు. ఏమనంటే "ఆదివారం మద్యాహ్నం నగర శివారులలో ఉన్న రంపపుపొడి కుప్పవద్ద మదర్ జోన్స్ మీటింగు పెడుతున్నారు" అని, చెవిటివాడు నాకు వినబడలేదు, మళ్ళీచెప్పమని అడిగేవాడు. రెండవ వ్యక్తి గట్టిగా అరుస్తూ సమాధానం చెప్పేవాడు. ఈ విధంగా మొత్తం కార్మికుల్లోకి మీటింగు పెడుతున్న కబురువెళ్ళింది. భారీ సంఖ్యలో కార్మికులు సమావేశానికి వచ్చారు.

మీటింగు అయిన తరువాత నేను, మరో ముగ్గురు గని కార్మికులం కలిసి ఫైర్‌మౌంట్‌కి బయలుదేరాము. గని కార్మికులైన జోబాల్లే, చార్లి బ్లాక్‌లెట్, బార్నేరైస్‌లు ఫైర్‌మౌంట్‌కి కాలినడకన బయలుదేరారు. నా కోసం చిన్న పిల్లాడు సారధిగా ఉన్న గుర్రపు బగ్గీని ఏర్పాటు చేశారు. నేను ఫైర్‌మౌంట్ దగ్గరలోకి వెళ్ళాక, కార్మికుల కోసం నగర శివార్లలో వంతెన ముందు వేచి ఉండాలని అనుకున్నాము. వంతెన మీద ఇంటర్ అర్బన్ కార్లు నడుస్తాయి. నేను వంతెన దాటే సమయానికి చీకటిపడింది. వంతెన ప్రక్కన ఒక చీకటి భవనం ఉంది. ఈ భవనం కోల్‌కంపెనీ వాళ్ళ గోడౌన్. దీనికి గన్‌మెన్‌లు కాపలా కాస్తున్నారు. వంతెన మీద వెలుతురు లేదు. గోడౌన్‌లో ఎవరూ లేరు. ఒక గన్‌మెన్ మమ్మల్ని ఆపాడు. నేనతని ముఖాన్ని చీకటి వల్ల చూడలేకపోయాను. "మీరెవరని" అడిగాడు. నేను "మదర్‌జోన్స్ అని" చెప్పాను. నా ప్రక్కన ఉన్న కుర్రాడు గని కార్మికుని కొడుకని చెప్పాను. అయితే మీరేనా మదర్‌జోన్స్ అని" అంటూ అతని తుపాకిని దబదబలాడించాడు. అవును, "నేనే మదర్‌జోన్స్‌నని" చెప్పాను. "నువ్వు ఈ రోజు రాత్రికి గోడౌన్స్‌ని జాగ్రత్తగా చూసుకో, రేపు నీకోసం నేను క్రొత్త ఉద్యోగం వెతకవలసి వస్తుంది' అని అతన్ని ఆటపట్టించాను.

నేను వంతెన దాటాక బగ్గీలో నుండి బయటకు దిగాను. నాతో వచ్చిన కుర్రాడిని ఇంటికి పంపించాను. పంపిస్తూ అతనితో, కార్మికులు కనిపిస్తే వేగంగా రావాలని, నేను వంతెన దాటాక వారికోసం ఎదురు చూస్తుంటానని చెప్పమన్నాను. నాకు కనుచూపు మేర ఒక్క ఇల్లు కూడా కనిపించలేదు. వంతెనమీద గన్‌మెన్‌ల నడకను మాత్రమే చూస్తున్నాను. చాలా చీకటిపడింది. నేను నేలమీద కూర్చొని ఎదురుచూస్తున్నాను. అగ్గిపుల్ల గీసి నా గడియారాన్ని తీసి చూస్తే, అప్పుడు ఒక ఇంటర్ అర్బన్ కారు వచ్చే సమయమైంది. అకస్మాత్తుగా 'హత్య! హత్య! పోలీస్! సహాయం చేయండనే! కేకలు చీకటిలో నుండి వినబడ్డాయి. పరుగు శబ్ధం వినిపించింది. వంతెన దాటుకొని పరిగెడుతూ బార్నేరైస్ నావైపు వచ్చాడు. వీని వెనకాలే బ్లాక్‌లే ఇంకా వేగంగా పరిగెడుతూ వచ్చాడు. హత్య! హత్య! అని అరిచాడు. నేను వాళ్ళవైపు వేగంగా వెళ్ళాను. "జో" ఎక్కడని అడిగాను. గన్‌మెన్‌లు జోని వంతెనమీద చంపేస్తున్నారని చెప్పారు. ఇంతలో ఇంటర్‌అర్బన్ కారువచ్చి బ్రిడ్జీమీద ఆగింది. నాకు టక్కున ఒక ఆలోచన వచ్చింది. వంతెన మీదకి పరిగెట్టాను. 'జో, జో' అని అరిచాను. 'మనవాళ్ళు గుంపుగా వస్తున్నారు, మొత్తం అందరూ వస్తున్నార'ని గట్టిగా అరిచాను. కంపెనీ కుక్కలు (గన్‌మెన్‌లు) ఇంటర్ అర్బన్ కారులో కార్మిక సైన్యం వచ్చిందనుకున్నారు. వాళ్ళు గోడౌన్‌లోకి పారిపోయి దాక్కున్నారు. జోని వంతెనమీద వదిలిపెట్టారు. అతని తల పగిలిపోయింది. రక్తం కారుతోంది. నా పెట్టీకోటును ముక్కలుగా చింపి తలకు గట్టిగా రక్తం కారకుండా కట్టు కట్టాను. అతన్ని కారులో ఫైర్‌మౌంట్ నగరంలోకి తీసుకు వెళ్ళాము. డాక్టర్‌ను తీసుకు వచ్చి వైద్యం చేయించాము. డాక్టరు తలకు కుట్లువేశాడు. నేను రాత్రంతా మేల్కొని ఈ పేద కార్మికునికి సపర్యలు చేశాను. అతను స్పృహలో లేడు. ఆ కాళరాత్రి నేనే అతనికి కన్నతల్లినయ్యాను. మరుసటి రాత్రి నేను, టామ్ హగ్గర్టీ యూనియన్ మీటింగులో జరిగింది చెప్పాము. కార్మికులు గన్‌మెన్లను తుడిచి పెట్టాలన్నారు. దీనివలన ఇబ్బందులు ఇంకా పెరుగుతాయని చెప్పాను. జోని చూడడానికి వెళ్ళడం కోసం మీటింగుని వాయిదా వేశాము. ఒకేసారి ఆరు లేదా

ఎనిమిది మంది జో రూంలోకి వెళ్ళి చూసివచ్చేవారు. కార్మికులందరూ జోని పరామర్శించారు.

మేము జోపై హత్యాయత్నానికి పాల్పడిన గన్‌మెన్‌లను అరెస్టు చేయడానికి వారెంట్ కోసం ప్రయత్నించాం. కానీ మా వల్ల కాలేదు. ఎందుకంటే కోర్టులను బొగ్గు కంపెనీ తన గుప్పెట్లో పెట్టుకుంది.

ఒక్క జో మాత్రమే గన్‌మెన్‌ల చేతులలో దెబ్బలు తినలేదు. చాలామంది గన్‌మెన్‌ల బాధితులున్నారు. ఈ రక్తం మరిగిన కుక్కల అకృత్యాలు చెప్పేందుకు ఎన్ని పేజీలైనా చాలవు. క్లార్క్‌బర్గ్‌లో కార్మికులను నా మీటింగుల కోసం ప్రయత్నాలు చేస్తే చంపేస్తామని బెదిరించారు. కానీ రైల్వే కార్మికులు అర్ధరాత్రి దాటిన తరువాత మీటింగు పెట్టుకుంటే నేను దానికి ఒంటరిగానే వెళ్ళాను. మీటింగు కోర్టు హాస్‌లో పెట్టారు. హాలు కిక్కిరిసింది. ఈ మీటింగుకు మేయర్‌తో సహా ఇతర నగర అధికారులు వచ్చారు. 'గౌరవనీయులైన మేయర్, మీరు ఈ సమావేశానికి అధ్యక్షత వహించాలని' కోరాను అతను అంగీకరించలేదు. అతనే కాదు, నా ప్రతిపాదనను ఎవరూ అంగీకరించలేదు. అప్పుడు నేనే అధ్యక్షురాలిగా, ఉపన్యాసకురాలిగా ఆ సమావేశంలో ప్రకటించుకున్నాను.

ఎట్టకేలకు ఫైర్‌మౌంట్ ఫీల్డ్ కార్మికులు సంఘటితులయ్యారు. స్కాబ్స్‌ని, గన్‌మెన్‌లను తరిమికొట్టారు. తరువాత ఆర్గనైజర్ల అసమర్ధత, యూనియన్ ప్రధాన నాయకత్వం చేసిన ద్రోహం వలన యూనియన్లు తమ బలాన్ని కోల్పోయాయి.

చివరికి కార్మికులు తమ ప్రయోజనాలు కాపాడ్డానికి ఎన్నుకున్న కొద్దిమంది నాయకుల చేతిలో మోసపోయారు. చార్లేబాట్లే నష్టాన్ని పూడ్చడానికి ప్రయత్నించాడు. కానీ నాయకులు బాగా లంచాలు మరిగారని, మనమేం చెయ్యలేమని నిరుత్సాహపడ్డాడు. దీనితో అతను కూడా ఏమి చేయలేకపోయాడు.

ఈ పరిణామం నన్ను బాధపెట్టింది. వాస్తవానికి గన్‌మెన్‌ల ఇనుప పాదాల నుండి బయటపడడానికి కార్మికులు, మహిళలు చేసిన త్యాగాలు వ్యర్థమయ్యాయి. కార్మికుల చేత ఎన్నుకోబడిన నాయకులు చేసిన ద్రోహాలవలన సాధించుకున్న విజయాలు నాశనమయ్యాయి. పోరాటం యొక్క విలువ, బాధలు తెలియచెప్పిన నాయకులే ఇలా ద్రోహం చెయ్యడం ఇంకా బాధపెట్టింది.

నేను ముసలిదానినయ్యాను. మళ్ళీ ఫైర్‌మౌంట్ కార్మికులు యూనియన్‌లోకి వస్తారని అనుకోలేదు. అయితే వాళ్ళ పరిస్థితులు మార్చడంలో, వాళ్ళ పిల్లల భవిష్యత్ కోసం జరిగిన పోరాటంలో నా పాత్ర ఉన్నందున సంతోషించాను.

కనవా నది మీద గల కెల్లీక్రీక్ (నీటిపాయ)లో ఉన్న గని కార్మికుల సమస్యలపై పనిచేసేందుకు యునైటెడ్ మైన్ వర్కర్స్ యూనియన్ ప్రయత్నించింది. కానీ ఫలితాలు రాలేదు. దానితో యునైటెడ్ మైన్ వర్కర్స్ యూనియన్ బోర్డు మెంబర్లయిన బ్రూకే, టామ్ లేవిస్‌లు కెల్లీక్రీక్‌లో ఉన్న గని కార్మికులను స్వయంగా కలవాలని నిర్ణయించుకున్నారు. ఒకరాత్రి కెల్లీక్రీక్‌కు ట్రైన్‌లో బయలుదేరారు. ట్రైన్ చాలా ఎత్తున ఉన్న కొండలోయపైకి చేరుకుంది. అక్కడ ఈ ఇద్దరు నాయకులను మినహాయించి మిగిలిన ప్రయాణీకులందరినీ వేరే బోగీలోకి తరలించారు. నాయకులు ఉన్న బోగీని ట్రైన్ నుండి తప్పించారు. చేతితో పట్టాలపై లాగే ఒక ట్రాలీలోకి వీరిని మార్చారు. దీనిలో నుండి పట్టాలపై వీరిని బరబరా ఈడ్చి పారేశారు. వాళ్ళు మోకాళ్ళు, చేతుల పై పాక్కుంటూ పట్టాలు దాటారు. అప్పుడే ఒక రైలు పట్టాల మీద నుంచి వేగంగా వెళ్ళింది.

> **ఒక్క జో మాత్రమే గన్‌మెన్‌ల చేతులలో దెబ్బలు తినలేదు. చాలామంది గన్‌మెన్‌ల బాధితులున్నారు. ఈ రక్తం మరిగిన కుక్కల అకృత్యాలు చెప్పేందుకు ఎన్ని పేజీలైనా చాలవు. క్లార్క్‌బర్గ్‌లో కార్మికులను నా మీటింగుల కోసం ప్రయత్నాలు చేస్తే చంపేస్తామని బెదిరించారు.**

నాకు ఎప్పుడైతే యూనియన్ నాయకులను హత్య చేసేందుకు కోల్‌కంపెనీ చేసిన ప్రయత్నాల గురించి తెలిసిందో వెంటనే కెల్లీపాయకు వెళ్ళి, అక్కడ బానిస బతుకులు బతుకుతున్న కార్మికులను నిద్రలేపాలని నిర్ణయించుకున్నాను. నాతోపాటు పంతొమ్మిది ఏళ్ళ యువకుడు బెన్‌డేవిస్‌ను కెల్లీపాయకు తీసుకువెళ్ళాను. మేము కనవా నది తూర్పు ఒడ్డు వెంబడి నడిచాము. తూర్పు వైపునే కెల్లీపాయ ఉంది.

ఒక రోజు వేకువ జామున మేమే

కెల్లీపాయ అవతల ఒడ్డుకు చేరుకున్నాము. అవతల ఒడ్డు చేరేందుకు పాయకి అడ్డంగా నీటిలో నడిచాము. సూర్యోదయం కావస్తుండగా మార్షల్ అనే వ్యక్తి నడుపుతున్న దుకాణం తలుపుతట్టాము. నేను వచ్చిన పని అతనితో చెప్పాను. అతను స్నేహంగా ఉన్నాడు. నన్ను దుకాణం వెనకాల ఉన్న చిన్న గదిలోకి తీసుకువెళ్ళి ఫలహారం పెట్టి ఆదరించాడు. అయితే నాకు ఆతిధ్యం ఇచ్చినట్లు ఎవరికైనా తెలిస్తే తన దుకాణాన్ని నాశనం చేస్తారేమోనని ఆందోళన పడ్డాడు. గనిలో మీటింగు పెట్టేందుకు ఏవిధంగా కార్మికులకు నోటీసులు పంపిణీ చెయ్యాలో చెప్పాడు. కాని ఆ సమయంలో నేను అక్కడ ఉండటం ఎవరైనా చూస్తారేమోనని భయపడ్డాడు. కిటికీలో నుండి పదే పదే బయటకు చూసేవాడు.

చాలా ప్రొద్దుపోయాక కొంతమంది గని కార్మికులు పట్టణానికి మైలు దూరంలో ఉన్న కెల్లీపాయ ఒడ్డుకి చేరారు. అక్కడ ఒడ్డున ఉన్న రాళ్ళ మధ్య సమావేశం జరిగింది. చీకటి వలన ఒకరిని ఒకరం చూసుకోలేకపోయాము. ఒక పాత లాంతరు వెలుగులో నేను వాళ్ళకు యూనియన్ పెట్టుకోవాల్సిన అవసరాన్ని వివరించాను.

మరుసటి రోజునే నలభైమందిని పనిలో నుండి తీసేశారు. వాళ్ళను బ్లాక్‌లిస్టులో పెట్టారు. ముందు రోజు రాత్రి జరిగిన సమావేశంలో కంపెనీ గూఢాచారులు ఉన్నారు. తరువాత రోజున మళ్ళీ కొంతమందితో మీటింగ్ జరిగింది. వారందరినీ పనిలో నుండి తీసేశారు. దీనితో పోరాటం మొదలైంది. పచారికొట్టు యజమాని మార్షల్ ధైర్యవంతుడు, అతనికొట్టును నాకు అద్దెకిచ్చాడు. నేనక్కడే మీటింగులు పెట్టేదాన్ని. కంపెనీ జనరల్ మేనేజర్ కూడా కొలంబస్ నుండి వచ్చి మీటింగు పెట్టాడు.

జనరల్ మేనేజర్ మీటింగులో ''సిగ్గులేదా, ఒక ముసిలిదాని నాయకత్వంలో నడుస్తారా" అని ఎద్దేవా చేసాడు.

''మదర్‌జోన్స్ వర్ధిల్లాలి'', అని కార్మికులు నినాదాలిచ్చారు.

తరువాత ఆదివారం గుబురుగా ఉన్న చెట్ల మధ్య మీటింగు జరిగింది. కార్మికులు ప్రదర్శన చేశారు. కాని జనరల్ మేనేజర్ జాన్ రోవెన్ తన ప్రత్యేక కారులో కొలంబస్ నుండి వచ్చాడు. ప్రతి ఒక్క గని కార్మికుడు మాతో ఉన్నాడు. మేము కంపెనీ హొటల్ ముందు నిలబడి ప్రదర్శన చేసాం. జనరల్ మేనేజర్ బయటకు రావాలని గట్టిగా నినాదాలిచ్చాము. అతను బయటికి రాలేదు. కంపెనీ వాళ్ళ రెండు "ముద్దు కుక్కలు' వరండాలో గుమ్మం ముందు తచ్చాడుతున్నాయి.

వాటిలో ఒకటి, "ఆ ముసలిదాన్ని చెట్టుకి ఉరితీయాలన్నాడు".

"అవును" అని రెండవ వాడు అంటూ ఉరితాడుని లాగడం తనకిష్టమన్నాడు.

మేము తిరిగి మీటింగు పెట్టుకున్న చెట్ల దగ్గరికి చేరాము. వెయ్యిమందికి పైగా కార్మికులు వచ్చారు. వారితో పాటు చొంగకారుస్తూ కంపెనీ 'ముద్దు కుక్కలు' కూడా వచ్చాయి. నేను మాట్లాడటానికి లేచి నిలబడ్డాను. నా వీపును ఒక పెద్ద చెట్టు మొదలుకు ఆన్చి, ఆ కుక్కలవైపు చూస్తూ మాట్లాడాను. 'ఇదిగో చెట్టు ముసల్ది. ఒకతాడు తెచ్చి ఉరితీయండని' గట్టిగా అరిచాను.

ఎట్టకేలకు కెల్లీపాయలో యూనియన్ ఏర్పడింది. కార్మికులు యాజమాన్యం నుండి ఏమి లాభాలు సాధించుకున్నారో నాకు తెలీదు గానీ, వారు యూనియన్ పెట్టుకోవడమంటే ఓనమాలు నేర్చుకోవటమే. వాళ్ళు పై తరగతులకు వెళ్ళడానికి చాలా అడ్డంకులు వస్తాయి. కంపెనీ యజమానులకు చెందిన వై.ఎం.సి.ఏలు, పూజారులు, టీచర్లు, డాక్టర్లు, వార్తా పత్రికలు- వీరెవ్వరూ కార్మికులకు సంబంధించిన విషయాలను చెప్పరు. దానితో కార్మికులకు అవసరమైన విషయాలు తెలుసుకొనే అవకాశాలు చాలా తక్కువగా వుంటాయి. ◆

**మరుసటి రోజునే నలభైమందిని పనిలో నుండి తీసేశారు. వాళ్ళను బ్లాక్‌లిస్టులో పెట్టారు. ముందు రోజు రాత్రి జరిగిన సమావేశంలో కంపెనీ గూఢాచారులు ఉన్నారు. తరువాత రోజున మళ్ళీ కొంతమందితో మీటింగ్ జరిగింది. వారందరినీ పనిలో నుండి తీసేశారు. దీనితో పోరాటం మొదలైంది. పచారికొట్టు యజమాని మార్షల్ ధైర్యవంతుడు, అతనికొట్టును నాకు అద్దెకిచ్చాడు. నేనక్కడే మీటింగులు పెట్టేదాన్ని.**

రిపోర్టు

# మద్యం మహమ్మారికి ఛిద్రమవుతున్న కుటుంబాలు

## ఐద్వా సర్వేలో వెలుగుచూసిన భయంకర అంశాలు

- కె.శ్రీదేవి

అప్పన్నకు 60 సంవత్సరాలు. ఇతను మున్సిపల్ ఎంప్లాయి. 2014 జరిగిన ఎన్నికల్లో రాజకీయ ప్రచారంలో పాల్గొన్నాడు. ఊరికే వచ్చిందని 2నెలలు ఫుల్లుగా తాగాడు. ఎన్నికలు అయిన తరువాత ఊపిరితిత్తులు, కిడ్నీలు పూర్తిగా పాడై పక్షవాతం వచ్చింది. అన్నీ మంచంలోనే. తాగబోయించిన నాయకులు ఇతని ముఖం చూడటం లేదు. ఆ కుటుంబంలో ఇంకా పెళ్లి కావాల్సిన కూతురు వుంది. భార్యా, తల్లి నివశిస్తున్నారు. ప్రస్తుతం భార్య ఇళ్లలో పాచిపనికి వెళ్లి కుటుంబాన్ని పోషిస్తున్నది. రాధాకృష్ణ (30సం॥లు) ఆటోడ్రైవర్. పెళ్ళై 3 సంవత్సరాలు అయింది. రోజు సంపాదన 500రూాలలో 100 మాత్రమే ఇంట్లో ఇస్తాడు. ప్రతిరోజు పీకలదాకా తాగి భార్యను చిత్రహింసలు పెడతాడు. వీరికి 3 నెలల వయసుగల కొడుకు ఉన్నాడు. భార్యను కొడుతున్న సమయంలో ఉయ్యాలలో వున్న ఆ బాలుడి తలకు దెబ్బతగిలి క్రిందపడిపోయాడు. హాస్పటల్‌కి తీసుకు వెళ్లగా తలకు బలమైన దెబ్బ తగలడం వల్ల బ్రతకడం కష్టమన్నారు. 2 రోజుల తరువాత ఆ బాలుడు చనిపోయాడు. ఆమె చిత్తుకాగితాలు ఏరుకుని జీవిస్తున్నది. చంద్రయ్య (50) కు భార్య 6గురుపిల్లలు. విపరీతంగా తాగడం వల్ల మతిభ్రమించి 3 నెలల క్రితం ఇంట్లో నుండి వెళ్ళిపోయాడు. చంద్రయ్య భార్య మార్కెట్‌లో పనికిపోతూ కుటుంబం నడుపుకుంటున్నది. ఇదేదో క్రైం స్టోరీ కాదు. ఐద్వా సర్వేలో వెలుగుచూచిన కొన్ని నిజాలు. ఇలా మద్యం బారినపడి ఛిద్రమవుతున్న కుటుంబాలు ఎన్నో!

**మద్యం పాలక పార్టీలకు వరంగా, పేదలకు శాపంగా మారింది. ప్రభుత్వాలు ఎన్ని మారినా మద్యం తాగి మధ్యలోనే తనువు చాలిస్తున్న కుటుంబాల తలరాతలు మార్చడం లేదు. ఎన్నికల పండుగ వచ్చినప్పుడల్లా పేద కుటుంబాల్లో రెండు నెలల పాటు ఉపాధి దొరుకుతుంది. బూర్జువా రాజకీయ పార్టీలు ఎన్నికల ప్రచారంలో రోజంతా పాల్గొంటే మంచి బిర్యాని, మద్యంసీసా, రెండొందలిస్తున్నాయి. అప్పటి వరకు మద్యం అలవాటులేని యువకులు కూడా తాగుడుకు అలవాటుపడుతున్నారు.** ఆ రెండు నెలల్లో రాజకీయ నాయకులు వారి పని పూర్తి చేసుకుంటారు. గెలిచినా, ఓడిన మరలా 5 సంవత్సరాల వరకు వీరి ముఖం చూడరు. డబ్బు ఇవ్వకుండా వచ్చిందని అప్పుడు తాగుడుకు అలవాటు పడిన వారు తాగుడు మానలేక వ్యసనపరులుగా మారిన వారి కుటుంబాలు ఏ రకంగా వున్నాయో పరిశీలిస్తే కళ్ళవెంట నీళ్ళు రావడం మన వంతు అవుతున్నది.

ఒకప్పుడు మద్యం త్రాగేవారిని త్రాగుబోతు అని ఈసడించుకునేవారు. దానిని ఒక దుర్వసనంగా ప్రచారం చేసేవారు. పాలకులు ప్రజలను కొల్లగొట్టటం కోసం మద్యం త్రాగటాన్ని ఒక ఫ్యాషన్‌గా మార్చేశారు. దీనితో ధనవంతుడు, పేదవాడు అనే భేదం లేకుండా యువతకు మద్యం సేవించటం ఒక ఫ్యాషన్‌గా మారింది.

**మద్యం పాలక పార్టీలకు వరంగా, పేదలకు శాపంగా మారింది. ప్రభుత్వాలు ఎన్ని మారినా మద్యం తాగి మధ్యలోనే తనువు చాలిస్తున్న కుటుంబాల తలరాతలు మార్చడం లేదు. ఎన్నికల పండుగ వచ్చినప్పుడల్లా పేద కుటుంబాల్లో రెండు నెలల పాటు ఉపాధి దొరుకుతుంది. బూర్జువా రాజకీయ పార్టీలు ఎన్నికల ప్రచారంలో రోజంతా పాల్గొంటే మంచి బిర్యాని, మద్యంసీసా, రెండొందలిస్తున్నాయి. అప్పటి వరకు మద్యం అలవాటులేని యువకులు కూడా తాగుడుకు అలవాటుపడుతున్నారు.**

ప్రజలపై మద్యం ప్రభావం ఎలా ఉందో నిర్థిష్టంగా తెలుసుకోవటం కోసం ఇటీవల అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం(ఐద్వా) విజయవాడ నగరకమిటీ న్యూ రాజరాజేశ్వరి పేటలో ఐదు రోజులపాటు సర్వే నిర్వహించింది. ఈ ప్రాంతం పూర్తిగా పేదలు నివశించే ప్రాంతం. నగరంలో అనేక కాలువ కట్టలపై నివశించేవారిని ప్రభుత్వం ఇక్కడకు తరలించి పునరావాసం కల్పించింది. ఈ ప్రాంతం నుండి నగరంలోకి రావాలంటే రెండువైపులా రహదారులున్నాయి. ఈ రహదారుల్లో

రెండు బార్‌షాపులున్నాయి. సర్వే కోసం 1000కుటుంబాలను ఐద్వా ప్రతినిధి బృందం కలిసింది. అందులో 300 కుటుంబాలు పనికి వెళ్ళడంతో తలుపులు తాళాలు వేసి ఉన్నాయి. మిగిలిన 700కుటుంబాలను కలిసి వివరాలు సేకరించింది. 700 కుటుంబాలకుగాను 638 కుటుంబాల్లో తాగుడుకు బానిసలైనవారున్నారు. వ్యసనపరులుగా మారిన వారిలో 15 సం॥ల వయస్సునుండి వృద్ధులవరకూ ఉన్నారు. ఆ కుటుంబాలలో మహిళల పరిస్థితి దయనీయంగా వుంది. ప్రతి మహిళా పాచి పనికో, దుకాణాల్లో సరుకులు బాగుచేసేందుకో, చిన్న చిన్న కంపెనీల్లో అతి తక్కువ వేతనాలకు పనికి పోవల్సిందే. ఆ కుటుంబంలో మగవారి ఆదాయం ఇంటికి వచ్చే పరిస్థితి లేదు. వీరిలో రిక్షాలాగేవారు, ఆటో డ్రైవర్లు, లారీ డ్రైవర్లు,క్లీనర్లు, కాగితాలేరుకునే వారున్నారు. ఇంటి అవసరాలకు ఒక్క రూపాయి కూడా ఇవ్వని వారున్నారు. భర్త తాగుబోతుగా మారిన తరువాత రోజు పనిచేసి వచ్చిన తరువాత భార్యను హింసించడం రివాజుగామారింది. పిల్లల్ని సరిగా పెంచే పరిస్థితి లేదు. ఎక్కువ కుటుంబాలు తమపిల్లలను గవర్నమెంట్ స్కూల్‌కు పంపిస్తున్నారు. మధ్యాహ్నం భోజనం వుండటం వల్ల పిల్లలకు కనీసం ఒకపూట ఆహారమైనా అక్కడ లభిస్తున్నది. అక్కడ 25 కుటుంబాలలో పిల్లల పెంపకం బాధ్యత నానమ్మ,అమ్మమ్మలపై ఉన్నది. సర్వే చేస్తున్నప్పుడు 10 సంవత్సరాల బాబు సర్వే చేస్తున్న బృందం వద్దకు వచ్చి మా నాన్న పేరు వ్రాయండని కోరాడు. ఎందుకని సర్వే బృందం ప్రశ్నించినప్పుడు ఆ బాలుడు చెప్పిన విషయాలు ఎంత హృదయవిదారకంగా ఉన్నాయో బాబు మాటల్లోనే వింటే తెలుస్తుంది. "నాన్న విపరీతంగా తాగి ప్రతిరోజూ అమ్మను కొడతాడు. అమ్మ భయపడి నన్ను, తమ్ముడ్ని వదిలి అమ్మమ్మ ఊరు వెళ్ళింది. నాన్న తాగి మమ్మల్ని పట్టించుకోడు. నేను కేర్& షేర్ స్కూల్‌లో చదువుతున్నాను. మధ్యాహ్నం భోజనం అక్కడ చేస్తాను. సాయంత్రం భోజనం లేదు. అందుకే బండ్ల దగ్గర అడుక్కొని తింటున్నాను. మీతో మాట్లాడటం చూస్తే నాన్న కొడతాడు. వెళ్తున్నాను అంటీ" అని దీనంగా చెప్పాడు. సర్వే చేసిన ప్రతి ఒక్కరి వెనుక ఇలాంటి దయనీయ గాథలే వున్నాయి.

మద్యానికి తోడు గంజాయి, కొత్తగా మార్కెట్‌లోకి వచ్చిన మద్యం బిళ్ళలు విచ్చలవిడిగా దొరుకుతాయి. రాత్రి 9 గంటలు దాటితే మహిళలు తిరగలేని పరిస్థితి. 15 సంవత్సరాల వయస్సు వున్న వారు కూడా గంజాయి పీలుస్తూ వయస్సు తారతమ్యాలు మరచి మహిళల్ని కామెంట్స్ చేయడం, అల్లరి చేయడం నిత్యకృత్యమయింది. సరైన వైద్యం, పిల్లల చదువు, పోషణ, పౌష్టికాహారం తీసుకుంటున్న కుటుంబాలు నామమాత్రం. మహిళలు సైతం కుటుంబ పోషణ కొరకు వ్యసనాల బారిన పడవలసి వస్తుంది. భర్తలు మద్యలోనే తనువులు చాలించటం వల్ల మహిళలు చిన్న వయస్సులోనే అనాథలుగా మారుతున్నారు. మద్యం మహమ్మారికి బలైన కుటుంబాలు అప్పుల ఊబిలో చిక్కుకొని గిలి గిల కొట్టు కుంటున్నాయి. ప్రభుత్వాలకు ఈ దీనుల బాధలు పట్టవు. ఎన్నికల్లో వాళ్ళ పబ్బం గడుపుకోవడానికి పేదవారిని ముఖ్యంగా యువకులను తాగుబోతు లుగా మార్చి సక్రమంగా ఆలోచన చేయకుండా వుండటమే ప్రధాన లక్ష్యంగా మారింది.

అందుకే ఏ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా మద్యాన్ని ప్రధాన ఆదాయ వనరుగా మార్చుకొని టార్గెట్లు పెట్టి అమ్ముతున్నారు. ఎక్కువ దూరం వెళ్ళి తాగే అవసరం లేకుండా నివాస ప్రాంతాల్లోనే షాపులకు పర్మిషన్లు ఇస్తున్నారు. నిబంధనలు వీరికి పట్టవు. ఖజానా నింపుకోవడమే ప్రభుత్వ ప్రధాన లక్ష్యం. ప్రజల రక్తాన్ని పీల్చుతూ ఆదాయం పొందటమే బ్రాందీషాపుల యజమానుల లక్ష్యం. తాగి మద్యలోనే తనువు చాలించడం పేదవారికి రివాజుగా మారింది. భర్తలను కోల్పోయి ఒంటరి మహిళలుగా మారి కుటుంబాలు పోషించుకోలేక, చుట్టుప్రక్కల వారి వేధింపులు తాళలేక నలుగుతున్న మహిళల్ని గూర్చి ప్రభుత్వానికి ఏమాత్రం చింతలేదు. ఎన్నికలప్పుడు మా ఆడపడుచులంటూ అతి ప్రేమకురిపించే ఈ నాయకులకు వారి కుటుంబాలు ఛిద్రమైపోతుంటే ఏమాత్రం పట్టడంలేదు. **వైన్ షాపులలోనే కాకుండా మాల్స్‌లో కూడా పెట్టి అమ్మటానికి ప్రయత్నాలు జరుగు తున్నాయి.**

పేదల కుటుంబాలపట్ల, ప్రత్యేకించి మహిళల దుస్థితిపట్ల ఈ పాలకుల వైఖరి మారదు. ఇక మహిళలే తమను తాము కాపాడుకోవాలి, తమ కుటుంబాలను కాపాడుకోవాలి. సమైక్యంగా మద్యానికి వ్యతిరేకంగా పోరాడాలి. మన రాష్ట్రంలో అనేక చోట్ల మద్యానికి వ్యతిరేకంగా మహిళలు ఉద్యమిస్తున్నారు. ఈ ఉద్యమాలు రాష్ట్ర వ్యాపితంగా మరింతగా పెరగాలి. "మీరు మారకపోతే మిమ్మల్నే మార్చేస్తాం'' అంటూ పాలకులను హెచ్చరించాలి. పాలకుల గుండెల్లో గుబులు పుట్టించే స్థాయిలో మద్యం వ్యతిరేక ఉద్యమాలు సాగాలి. ఐద్వా ఈ పోరాటాలకు అండగా నిలుస్తుంది. ◆

నివాళి

# ధన్యజీవి నాగిరెడ్డి అనసూయ

ఉపాధ్యాయ ఉద్యమంలో అనేక బాధ్యతలు నిర్వహించిన శ్రీమతి నాగిరెడ్డి అనసూయ 2015 నవంబరు 12వ తేదీ ఆమె స్వగ్రామం ప్రకాశంజిల్లా సింగరాయ కొండలో మరణించారు. చిరకాలంగా అనారోగ్యంతో బాధపడుతున్న శ్రీమతి అనసూయ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ వ్యవస్థాపక నాయకులలో ఒకరైన, మాజీ శాసనమండలి సభ్యులు దాచూరి రామిరెడ్డి గారి సహధర్మచారిణి. సుదీర్ఘకాలం ఉపాధ్యాయినిగా పనిచేసి 2001 జూన్ 30వ తేదీన పదవీ విరమణ పొందారు. తన సర్వీసు మొత్తం ఆదర్శ ఉపాధ్యాయినిగా పనిచేసి, ఎందరో విద్యార్థులను తీర్చిదిద్దడమే కాకుండా ఉపాధ్యాయ ఉద్యమంలో ప్రత్యేకించి మహిళా ఉపాధ్యాయుల్లో చైతన్యం నింపడానికి కృషి చేశారు. అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం అభ్యున్నతికి తోడ్పాటు నందించారు.

1943 జులై 1వ తేదీన కడప జిల్లా పులివెందుల సమీపంలోని భూమయ్యగారి పల్లె గ్రామంలో నాగిరెడ్డి చిన మల్లారెడ్డి, చెన్నమ్మలకు జన్మించారు అనసూయ. తండ్రి మల్లారెడ్డి కమ్యూనిస్టు పార్టీలో చురుకైన కార్యకర్త. స్వతహాగా కమ్యూనిస్టు కుటుంబం కావడం వల్ల తొలినుంచీ అభ్యుదయ భావాలతో పెరిగారు. ఆడపిల్లల చదువుకు, ఆర్థిక స్వాతంత్ర్యానికి ప్రాధాన్యతనిచ్చారు. 1964 ఏప్రిల్‌లో రామిరెడ్డి గారిని వివాహం చేసుకున్నారు. సనాతన సంప్రదాయాలు, మంత్రోచ్చారణలకు చోటు లేకుండా దండలు మార్చుకోవడం ద్వారా ఆదర్శ వివాహం చేసుకున్నారు.

వివాహం అయిన తరువాతనే భర్త ప్రోత్సాహంతో ఉపాధ్యాయ శిక్షణ పూర్తిచేసి, ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించారు. అనేక పాఠ్యాంశేతర కార్యక్రమాలలో విద్యార్థులను ప్రోత్సహించి, తను స్వయంగా ముందుండి స్ఫూర్తినందించారు.

ఓవైపు ఉద్యోగ బాధ్యతలు, మరోవైపు ఇంటిని చక్కబెట్టుకోవడంతోపాటు మూడవ బాధ్యతగా ఉపాధ్యాయ ఉద్యమంలో చురుకైన పాత్ర పోషించారు. జన విజ్ఞాన వేదిక, మహిళా సంఘం, విద్యార్థి ఫెడరేషన్‌వంటి అనేక ప్రజాసంఘాల పెరుగుదలకు ప్రత్యక్షంగా పరోక్షంగా అనసూయగారు తోడ్పడ్డారు.

**సంతానం లేదు కానీ ఎందరికో తల్లి!**

అనసూయ - రామిరెడ్డి దంపతులకు పిల్లలు లేరు, కానీ ఎందరికో ఆమె తల్లి. వారి బంధువుల పిల్లల్లో, స్నేహితుల పిల్లలో ఎవరో ఒకరు ఎప్పుడూ వారింట్లో ఆశ్రయం పొంది చదువుకుంటుండేవారు. సమానంగా ఆదరించి, ఆప్యాయతను పంచారు.

**దాంపత్యానికే ఆదర్శం వారి బంధం**

51 సంవత్సరాల వైవాహిక జీవితంలో 37 ఏళ్ళు రామిరెడ్డిగారికి సహకరించి, ఉద్యమ వృద్ధికి అనసూయగారు తోడ్పాటునిస్తే, ఆ తరువాతి 14 సంవత్సరాలు రామిరెడ్డిగారు తన ధర్మపత్నిని పసిపాపలా చూసుకున్న తీరు అందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది,

ఆ దంపతుల దగ్గర చదువుకోగలిగిన అపురూప అవకాశం పొందిన వారిలో నేను ఒకదాన్ని. చదువుతోపాటు విలువలు వంటపట్టినా, చేసే పని పట్ల చిత్తశుద్ధి, సామాజిక స్పృహ కాస్తో కూస్తో అలవడినా, ఆ దంపతుల శిక్షణే కారణం. చివరి వరకూ వారిలా వుండగలనో లేదో తెలియదు గానీ, వారు చూపిన బాటలో ప్రయాణించడానికి పూర్తిగా ప్రయత్నించడమే అనసూయగారికి అందజేసే నివాళిగా భావిస్తున్నా. ◆

**- డా॥ ఎం. ప్రగతి**

ఆరోగ్యం

# రక్తహీనత - మహిళల పై ప్రభావం

- డా॥ కె. భారతీ సాగర్

రక్తహీనత సాధారణంగా అందరిలో వస్తూ ఉండే ఒక వ్యాధి. అయితే మహిళల్లో, పిల్లల్లో ఇది ఇంకా ఎక్కువగా వస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 25% మంది ప్రజలు రక్తహీనతతో బాధపడుతున్నారు. అయితే అభివృద్ధి చెందిన దేశాలలో పోషకాహారలోపం ముఖ్యంగా ఐరన్ మూలకం లోపం వలన వచ్చే రక్తహీనత దాదాపుగా లేనే లేదు. కానీ అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఐరన్ లోపం వలన వచ్చే రక్తహీనత అధికంగా ఉంటోంది. గర్భవతులైన స్త్రీలలో ఉష్ణమండల దేశాలలో 40-80 శాతంగా ఉంటోంది.



రక్తంలో హీమోగ్లోబిన్ 10గ్రా/100 మి.లీ. కన్నా తక్కువ ఉంటే అది రక్తహీనతగా పరిగణించబడుతుంది. స్థూలంగా రక్తహీనతని ఐదారు గ్రూపులక్రింద విభజిస్తారు.

**పౌష్టికాహారలోపం వలన:**

రక్తంలోని హిమోగ్లోబిన్ ఏర్పడటానికి తోడ్పడే ఐరన్, ఫోలిక్ ఆసిడ్, విటమిన్ బి-12, మాంసకృత్తులు వంటి వాటి లోపం వలన వచ్చేవి.

**రక్తస్రావం వలన:**

ఇది తీవ్రమైన రక్తస్రావం వలన వచ్చేది. లేదా దీర్ఘకాలం కొంచెం కొంచెం రక్తం స్రవిస్తుండటం వలన వచ్చేది. ఏదైనా దెబ్బ తగిలినపుడు లేదా ప్రమాదం జరిగినపుడు తీవ్ర రక్తస్రావం జరిగితే లేదా కడుపు కొక్కెం పురుగులు, గుదద్వారం దగ్గర వచ్చే మొలలు, ఫిషర్స్‌లో కొంచెం కొంచెంగా రోజూ రక్తస్రావం జరుగుతుండటం వలన రక్తంలోని హిమోగ్లోబిన్ వర్ణరంజకం పరిమాణం పడిపోతుంది.

**హిమోలైటిక్:** జన్యుపరమైన కారణాల వలన వచ్చే కామెర్లు, సికిల్‌సెల్ అనీమియా మొదలగునవి మరియు మలేరియా, ఇతర ఇన్ఫెక్షన్ల వలన రక్తనాశనం జరిగి రక్తహీనత ఏర్పడుతుంది.

**ఆటో ఇమ్యూన్ హీమోలైటిక్ అనీమియా**

**- హీమోగ్లోబిన్‌పతి - తలసేమియా**

**బోన్‌మారో:** (ఎముక మూలగ) క్షీణించి పోవటం లేదా ఎముక మూలగ తన పనిని చేయకపోవటం వలన కూడా రక్తహీనత సంభవిస్తుంది.

**వ్యాధి లక్షణాలు :** రక్తహీనతలో హీమోగ్లోబిన్ పతనం చాలా నిదానంగా ఉంటుంది. అలాగే లక్షణాలు వ్యక్తమయ్యేది కూడ నిదానంగానే ఉంటుంది. సాధారణంగా ఈ వ్యాధిలో గుండెదడ, తలనొప్పి, బలహీనత, కళ్ళు తిరగటం, చెవులలో గింగురుమనే శబ్దాలు, శ్వాస తీసుకోవటానికి కష్టపడటం, తొందరగా అలసిపోవటం, ఎత్తు ఎక్కలేకపోవటం లాంటివి ఉంటాయి. వివిధ వ్యాధుల వలన వచ్చే రక్తహీనతలో ఈ లక్షణాలతోపాటు ఆయా వ్యాధులకు సంబంధించిన లక్షణాలు కూడా ఉంటాయి.

ఈ రోగులలో నాలుక నున్నగా, గాజులాగా, పాలిపోయినట్లు ఉంటుంది. నాలుక, నోటి మూలల్లో పొక్కిపోయి నట్లుండటం, అన్నం గొంతులోనుంచి దిగటానికి లేదా మింగడం కష్టంగా ఉంటుంది. గోళ్ళు సొట్ట పడినట్లుండటం లాంటివి ఉంటాయి. పిల్లలు, గర్భిణీ స్త్రీలు మట్టి తినడం, బలపాలు తినడం లాంటివి చేస్తారు.

ఇంకా స్త్రీలలో ప్రత్యుత్పత్తి వ్యవస్థ కార్యకలాపాలలో కూడా మార్పులు వస్తాయి. రక్తహీనత అధికంగా ఉన్నప్పుడు నెలసరులు అగిపోడటం (అమెనోరియా), లేదా నెలసరి వచ్చినపుడు అధిక రక్తస్రావం జరగటం ఉంటుంది. అలాగే టీనేజ్ పిల్లల్లో యుక్త వయసున్న వారిలో అధికంగా

తెల్లబట్ట కావటం ఉంటుంది. రక్తంలో హీమోగ్లోబిన్ స్థాయి స్వల్పంగా ఉన్నప్పుడు వారిలో అన్ని రకాల ఇన్ఫెక్షన్స్ రావటానికి అవకాశం అధికంగా ఉంటుంది.

ఇవన్నీ ఒక ఎత్తైతే, గర్భావస్థలో వచ్చే రక్తహీనత ఒక ఎత్తు. ఇది ఎక్కువ ప్రమాదానికి దారి తీస్తుంది. గర్భిణీ స్త్రీలలో తీవ్రమైన రక్తహీనత ఉండి దానిని చికిత్స చేయకపోతే పుట్టబోయే బిడ్డ నెలలు నిండకముందే పుడుతుంది. పుట్టినపుడు రక్తహీనత ఉండదుకానీ, పుట్టిన తరువాత రక్తహీనత ఏర్పడుతుంది. గర్భిణీ స్త్రీలలో రక్తహీనత అధికంగా ఉన్నపుడు అధికంగా ఇన్ఫెక్షన్స్ రావచ్చు. ప్రీ-ఎక్లాంప్సియా రావచ్చు. హీమోగ్లోబిన్ 5గ్రా/డి1 కన్నా తక్కువ ఉన్నపుడు గుండె ఆగిపోయే పరిస్థితి తలెత్తవచ్చు. గర్భిణీ స్త్రీలలో 40% నుంచి 90% వరకు రక్తహీనత ఉంటోంది. భారతదేశంలో వీరిలో దాదాపు 20% మంది వివిధ ఉపద్రవాలతో ప్రసవ సమయంలో మరణానికి గురి అవుతున్నారంటే ఈ సాధారణ వ్యాధి ఎంత అసాధారణ పరిస్థితులకు కారణ మవుతుందో తెలుసుకోవచ్చు. ఇంకా దయనీయమైన పరిస్థితి ఏమిటంటే పల్లెటూర్లలో పాలిపోయినట్లుండి మొహంలో వాపు ఉన్న అమ్మాయిలను, స్త్రీలను తెల్లకామెర్లు అనే నెపంతో మంత్రగాళ్ళ దగ్గరికి, నాటువైద్యుల దగ్గరికి తీసుకెళతారు. స్మశానాలలో క్షుద్రపూజలు నిర్వహింపజేస్తారు. ఆ స్త్రీలను విపరీతమైన హింసకు గురిచేస్తారు. తెల్లకామెర్లు అంటే కామెర్లు కాదు, రక్తంలో హీమోగ్లోబిన్ అనే రంజకం అక్సిజన్ కణాలకు మోసుకొనిపోయే ఒక వాహకం పరిమాణం తగ్గటం. అది పెరగాలంటే, అది తగ్గటానికి ఏర్పడిన కారణాలను నిర్మూలించి దానికి చికిత్స అందించాలి. అంతేకాని మంత్రాలు ఏమిచేయలేవు. ఈ

**గర్భావస్థలో వచ్చే రక్తహీనతకు జాగ్రత్తగా చికిత్స చేయవలెను. వెంటనే హీమోగ్లోబిన్ శాతం పెరగటానికి ప్రయత్నించవలెను. ఐరన్ మాత్రలు, టానిక్‌ల ద్వారా ఇవ్వవచ్చు. అలాగే గర్భిణీకి ఐరన్ పిల్స్ పడకపోతే ఇంజెక్షన్ ఇవ్వవలెను. మనమందరం గమనించే ఉంటాం. గర్భంధరించిన స్త్రీలకు మొదటి మూడు నెలల్లో ఫోలిక్ ఆసిడ్ మాత్రలు,తరువాతి నెలల్లో ఐరన్ ఫోలిక్ ఆసిడ్ మరియు కాల్షియం బిళ్ళలు ఇచ్చేది. అన్ని ప్రాథమిక వైద్యకేంద్రాల్లో అంగన్‌వాడీ కేంద్రాల్లో, తరువాత ఆశావర్కర్ల ద్వారా ఇంటి వద్దకే వచ్చి ఈ మందులు ఇస్తారు. రక్తహీనత రాకుండా నివారించటానికి ఇవి క్రమం తప్పకుండా తీసుకోవలసి ఉంటుంది.**

పరిస్థితికి మనం ఆ అమాయక ప్రజలని తప్పు పట్టలేము. కానీ యుగాల తరబడి మెజారిటీ ప్రజలను మూఢ నమ్మకాలనే అంధకారంలోకి నెడుతున్న భూస్వామ్య, బూర్జువా వ్యవస్థను నిందించాలి. అక్షరాస్యత పెంచి జ్ఞానాన్ని పొందే చైతన్యం రావాలి.

**వ్యాధి నిర్ధారణ :** హిమోగ్లోబిన్ నిర్ధారించటానికి సాధారణ పరీక్షలు సరిపోతాయి. దీనితోపాటు పెరిఫెరల్ బ్లడ్ స్మియర్, ఎర్రరక్తకణాల సంఖ్య పిసివి, యంసివి. లాంటి హీమోగ్రామ్‌కి సంబంధించిన పరీక్షలు చేస్తారు. వీటిద్వారా రక్తహీనత ఏ తరహాకి చెందినది అనేది ప్రాథమికంగా నిర్ధారణ అవుతుంది. సాధారణ వ్యాధి కారణాలు నిర్ధారణ కాని పక్షంలో ఇంకా ఇతర రక్త పరీక్షలను, మల మూత్ర పరీక్షలను, ఎముక మూలగ పరీక్షలను చేయాల్సి రావచ్చు.

**చికిత్స :** వ్యాధి కారణాన్ని బట్టి చికిత్స చేయవలసి ఉంటుంది. ఐరన్‌లోపం కారణంగా వచ్చే రక్తహీనతలో ఐరన్ మాత్రలు కానీ, ఇంజెక్షన్‌ల రూపంలోకానీ అవసరాన్ని బట్టి అత్యవసర పరిస్థితిని బట్టి ఇవ్వవలసి ఉంటుంది. విటమిన్ బి.12, ఫొలిక్ ఆసిడ్, ప్రోటీన్లు తక్కువ ఉన్నప్పుడు అయా వాటిని ఇవ్వవలసి ఉంటుంది.

అలాగే ఇందులో కారణాన్ని రూపుమాపటం కూడా ప్రధాన చికిత్స. కడుపులో పురుగులు ఉంటే వాటికి చికిత్స చేయాలి. మొలలు, ఫిషర్స్ ఉంటే వాటిని తొలగించాలి.

తలసేమియా వంటి హీమోగ్లోబిన్ వ్యాధులలో క్రమ సమయంలో రక్తం ఎక్కించవలసి ఉంటుంది.

ఆటో ఇమ్యూన్ హీమోలైసిస్‌లో కార్టికోస్టిరాయిడ్ మందులు ఇస్తారు. ఇందులో అశ్వగంధ, పిప్పలే, యష్టీమధులాంటి ఇమ్యూనోమోదులేటరీ ఔషధాలను కూడా ఇవ్వవచ్చు.

పైవన్నీ అందరిలో సాధారణంగా చేసే చికిత్సలు. గర్భావస్థలో వచ్చే రక్తహీనతకు జాగ్రత్తగా చికిత్స చేయవలెను. వెంటనే హీమోగ్లోబిన్ శాతం పెరగటానికి ప్రయత్నించవలెను. ఐరన్ మాత్రలు, టానిక్‌ల ద్వారా ఇవ్వవచ్చు. అలాగే గర్భిణీకి ఐరన్ పిల్స్ పడకపోతే ఇంజెక్షన్ ఇవ్వవలెను. మనమందరం గమనించే ఉంటాం. గర్భంధరించిన స్త్రీలకు మొదటి మూడు నెలల్లో ఫోలిక్ ఆసిడ్ మాత్రలు,తరువాతి నెలల్లో ఐరన్ ఫోలిక్ ఆసిడ్ మరియు కాల్షియం బిళ్ళలు ఇచ్చేది. అన్ని ప్రాథమిక వైద్యకేంద్రాల్లో అంగన్‌వాడీ కేంద్రాల్లో, తరువాత ఆశావర్కర్ల ద్వారా ఇంటి వద్దకే వచ్చి ఈ మందులు ఇస్తారు. రక్తహీనత రాకుండా నివారించటానికి ఇవి క్రమం తప్పకుండా

తీసుకోవలసి ఉంటుంది.

ఆహారంలో ఐరన్ సమృద్ధిగా ఉన్న ఆహారం తీసుకోవటం కూడా అవసరం. ఆకుకూరలు, మాంసము, కాలేయం, నల్లనువ్వులు, బెల్లము, బీన్స్, గ్రుడ్లు, పచ్చిబఠానీలు, అంజీరపండ్లు, ఉల్లికాడలు మొ॥ వాటిలో ఐరన్ సమృద్ధిగా ఉంటుంది. ఆకుకూరల్లో ఉన్న ఫైటేట్స్ ఐరన్‌ని పూర్తిగా శరీరానికి అందనివ్వవు, కానీ మాంసంలో ఉన్న ఐరన్, మంచి ప్రోటిన్ సమక్షంలో బాగా శరీరంచే శోషింపబడుతుంది.

గర్భిణీస్త్రీలలో రక్తహీనత 5నుంచి 10 శాతం మందిలో తీవ్రంగా ఉంటుంది. అప్పుడు ఆమెను తక్షణం ఆసుపత్రికి తరలించాల్సి ఉంటుంది. రక్తం ఎక్కించడం, గుండెకు సంబంధించి డిగాక్సిన్, డమూరెటిక్స్ ఇస్తూ జాగ్రత్తగా చికిత్స చేయాలి. హీమోగ్లోబిన్ మధ్యస్థంగా (5 నుంచి 8గ్రాములు, డి1) ఉన్న వారికి ఇంజెక్షన్ల ద్వారా ఇచ్చే ఐరన్ - డెక్స్ట్రాన్ ఇవ్వటం ద్వారా వారిలో రక్తహీనతని తగ్గించవచ్చు.

చికిత్సలు, వ్యాధి నిర్ధారణ పరీక్షలు అన్ని ఉన్నతంగా అభివృద్ధి చేయబడ్డాయి. కానీ అన్నిటికన్నా ముఖ్యంగా అవసరమైంది ఇంటి ఇల్లాలి మీద శ్రద్ధ. భార్య గర్భం ధరించగానే ఎంతో సంతోషించే భర్త, వారి బంధువులు అంతే సంతోషంతో, శ్రద్ధతో ఆమె ఆహారాన్ని తీసుకొనేలాగా చూడాలి. ఇంట్లో అందరి అవసరాలను గమనించే స్త్రీ యొక్క అవసరాలు అందరూ గమనించి ఆమెకు సహకరించాలి. అంతేకాదు స్త్రీలు తమకి తాము కూడా ముందుకు రావాలి. తమ ఆరోగ్యం తమకు ముఖ్యం అనే చైతన్యాన్ని పెంపొందించుకోవాలి. ◆

## స్పందన

### ఎడిటర్ గార్కి

జులై సెప్టెంబర్ చెతన్యమానవి చదివిన ప్రతి ఒక్కరిని ఆలోచింపచేసి, చైతన్యపరిచే విధంగా ఉన్నది. కొండేపూడి నిర్మల గారు వ్రాసిన "రాళ్ళ మనుషులు" కథ చాలా బాగుంది. కథ చదువుతున్నంత సేపు అందులోని పాత్రలు కళ్ళ ముందు కదిలినట్లుగా ఉంది. ప్రస్తుతము సమాజంలో జరుగుతున్న విషయాలను చక్కగా వివరించారు.. వినోదిని గారు వ్రాసిన కట్ట కథలో మనకు స్వాతంత్ర్యం వచ్చిదాదాపు 68 సంవత్సరములు గడిచినా ఇంకా కనీస అవసరమైన మరుగుదొడ్లు లేక ముఖ్యంగా స్త్రీలు ఏ విధంగా ఇబ్బందిపడుతున్నారో కళ్ళకు కట్టినట్లుగా వర్ణించటం చాలా గొప్ప విషయం. స్వచ్ఛభారత్ గురించి మాట్లాడే మన ప్రధాని మోడీ గారికి ఈ కథను ఒకటికి పది సార్లు చదివి వినిపిస్తే బాగుంటుందేమో అనిపించింది. మొత్తంమీద మానవిలోని ప్రతి శీర్షికా, మరియు కవితలు ఎంతో విజ్ఞానదాయకంగా ఉన్నాయి. చైతన్య మానవిని త్రైమాసిక పత్రికగా కాక మాస పత్రికగా తీసుకొని వస్తే ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందని మనవి. త్వరలో ఆ ప్రయత్నము చేయగలరని ఆశిస్తున్నాను.

**- పసుపులేటి రమాదేవి,** హైదరాబాదు

మానవిలో వచ్చిన 'కట్ట' కథని వినోదిని గారు రాసిన తీరు చాలా బాగుంది. కనీస అవసరమయిన బాత్రూము లేకపోవడము ఒక బాధ అయితే ఆడపిల్లగా పుట్టడం మరొక బాధ. పల్లెలు అయినా, పట్నాలు అయినా పేదవారి బాధని ఈ కథ తెలియజేస్తుంది. బాత్రూమ్ లేని బాధలు పల్లెటూరులో పుట్టిన ప్రతివారికి అనుభవమే. కాకపోతే కొన్ని తేడాలు. పరిపాలించే పెద్దలకు పేదవాళ్ళ ఇళ్ళంత బాత్రూమ్‌లు. కనీస అవసరమైన బాత్రూమ్ లేని పరిస్థితి పేదలది. ఇంత బాధలు, ఇబ్బందులలో కూడా ఒకరినొకరు ప్రేమగా పలకరించడం చాలా బాగుంది. గొప్పవారం అనుకునే వారిలో లేని ప్రేమలు వీరి దగ్గర ఉన్నవి. ఈ కథ చదవటమంటేనే అబ్బా ఏమిటి ఇది అనేవాళ్ళూ ఉన్నారు. అలాంటి బాధలు తీసికొని వ్రాశారంటే ఆడపిల్లలు పడే ఇబ్బందుల పట్ల ఎంత అవగాహన ఉందో అర్థమవుతుంది. మా చెల్లెలుగారి అమ్మాయి ఒకసారి నాతో "ఈసారి చెట్టుగానో, గాడిదగానో, పందిగానో పుడతాను గాని, ఆడదానిగా పుట్టను" అంది. తనకు ఎంత బాధ కలిగితే అన్నదో ఇది చదివితే అదే అనిపిస్తుంది. చివరగా కరుణమ్మ చనిపోవడం బాధ కలిగించింది. మానవి చదువుతుంటే ఒక్కవ్యాసాన్ని గానీ, కథను గానీ వదలాలి అని అనిపించదు. అన్నీ బాగున్నాయి. ఇలాంటి పత్రికను తీసుకొస్తున్నందుకు ఐద్వా కమిటీకి ధన్యవాదాలు.

**- కె. శుభ,** హైదరాబాదు.

'కట్ట' కథ చదివిన తరువాత గ్రామాలలో ఆడవారు మరుగుదొడ్లు లేక ఎంత ఇబ్బందిపడుతున్నారో రచయిత చాలా స్పష్టంగా విశదీకరించారు. స్వచ్ఛ భారత్ అని పదేపదే చెబుతున్న మోదీ మరియు మంత్రివర్యులు యుద్ధ ప్రాతిపదికన చేయవలసిన కార్యక్రమం మరుగుదొడ్ల సమస్య. చీపుర్లుపట్టుకుని ఫోటోలకు ఫోజులివ్వడం కాదు. ఈ కథలో వర్ణన, పిట్టకథలు చెప్పడం వంటివి కథను మరింత శక్తివంతం చేశాయి. కథ చివరిలో దారుణం కన్నీరు తెప్పించింది.

**- నీరజ,** విజయవాడ.

(పుస్తక సమీక్ష)

# నిజం చెప్తున్నా - ఒక హిజ్రా కథ

## - రేవతి

- ఎన్. ఉమామహేశ్వరి

కులం పేరుతో మనల్ని ఎవరైనా కించపరిస్తే కళ్ళెర్ర చేస్తాం. ప్రాంతం పేరుతో అపహాస్యం చేస్తే తిరగబడతాం. మతం పేరుతో అవమానిస్తే అగ్గిలా మండుతాం. కానీ మనలోనే... మనతోపాటే పుట్టిన కొన్ని జీవితాలు ఇంతకు మించిన అవమానాల్ని పొందుతూ సమాజపు అంచుల్లోకి నెట్టివేయబడుతున్నారు. వాళ్ళూ మనలాంటి మనుష్యులే.. కాకపోతే చిన్నపాటి అసహజత్వం. మనసుకీ శరీరానికీ ఫ్రీక్వెన్సీ కుదరకపోవడం.. సర్దుబాటు చేసుకోలేని మనసు..అర్థం చేసుకోని సమాజం, అవమానాల్ని దిగమింగుకుంటూ తెచ్చిపెట్టుకున్న ధిక్కారం.. తమ చుట్టూ ఉన్న సమాజంపై ధిక్కారం, శరీరంపై అంతులేని మమకారం....

ఈ జీవితం ఏ ఒక్కరో ఇద్దరిదో కాదు. ఈ ప్రపంచంలో దాదాపు ఒక కోటిన్నర మంది దురదృష్టవంతుల పరిస్థితి ఇది. వాళ్ళని "ఆమె" అనలేం.."అతడు" అనలేం, అసలు ఏమీ అనుకోకుండా ఉండలేం. అలాంటి ఒక మేల్ మనిషి...ఫిమేల్ మనసూ కలగలిపి....

తన జీవితంతో తనే యుద్ధం చేసి..

తన జీవితంతో తనే ఇన్‌స్పైర్ అయ్యి..

తన లాంటి వాళ్ళకు ఒక "గ్రేట్ హ్యూమన్" గా గుర్తింపు తెస్తున్న రేవతి అలియాస్ దొరైస్వామి జీవితం ఇప్పుడు మీకు పరిచయం చేయబోతున్న "నిజంచెప్తున్నా - ఒక హిజ్రా ఆత్మ కథ".




ఈ సమాజం స్త్రీలనూ గౌరవిస్తుంది. పురుషులనూ గౌరవిస్తుంది. కానీ పుట్టుకతోనే ఈ రెండు లక్షణాలను కలబోసుకున్న వారిని మాత్రం చీదరించుకుంటుంది. అసాధారణ నిష్పత్తిలో ఎక్స్, వై క్రోమోజోములు కలవడం వలన ఏర్పడిన ఒక వైద్య పరమయిన విపత్తుపట్ల సమాజం సరయిన రీతిలో స్పందించకపోతే బలైపోతున్న జీవితాలివి. హిజ్రాలకు తల్లి తండ్రి కుటుంబ సభ్యుల నుంచే జీవితంలో మొదటిసారిగా చీత్కారపు రుచి తెలుస్తుంది. సామాజిక చీత్కారానికి గురయ్యే శరీరం తమ కుటుంబంలో భాగమై ఉంటే మొత్తం తమ కుటుంబమే సమాజ చీత్కారానికి, వేధింపులకు గురవుతుందని భయపడ్డ కుటుంబ సభ్యులు వీరిని వదిలించుకోవాలనుకుంటారు. మరోవైపు వీధిలోకి వెళ్ళినా, పనికి వెళ్ళినా, స్కూలుకు వెళ్ళినా సాటి మనుషుల నుంచి సాధింపులు ఒక వైపు. కుటుంబం వారిని వదిలించుకోవడానికి ప్రయత్నిస్తుంటే మరోవైపు ఈ సమాజంలో స్వేచ్ఛగా, గౌరవంగా తాము జీవించలేమన్న అధైర్యం వారిని తమదైన ప్రపంచంలోకి దారి వెతుక్కునేలా చేస్తుంది.

"నిజం చెప్తున్నా - ఒక హిజ్రా ఆత్మ కథ" పుస్తకం మగపిల్లవాడిగా పుట్టి అంతర్గతంగా స్త్రీ లక్షణాలున్న ఒక వ్యక్తి ఆత్మ కథ. ఇది ఒక వ్యక్తి ఆత్మ కథ అనటం కంటే ఆ సమూహం బయట ప్రపంచానికి సమర్పించుకొన్న సంవేదన అనవచ్చు. అవయవ మార్పిడి చేసుకుని హిజ్రాలుగా పిలవబడుతున్న వారు మానసికంగా పడిన సంఘర్షణల స్థాయిలను, సమాజంతో చేసిన యుద్ధాలను సాధారణీకరించి, సంగ్రహిస్తే దాని సారమే "నిజం చెప్తున్నా - ఒక హిజ్రా ఆత్మ కథ".

తమిళనాడులోని సేలం జిల్లా, నమక్కల్ తాలూకా పుట్టిహళ్ళీలోని ఒక సాంప్రదాయ రైతు కుటుంబంలో ముగ్గురు అన్నలు, ఒక అక్క తర్వాత దొరైస్వామి పుట్టారు. పెరుగుతున్న కొద్దీ దొరైస్వామి నడక, నడతా ఆహార్యాలు అమ్మాయినే పోలి ఉండేవి. అది గమనించిన తల్లిదండ్రులు దొరైస్వామిని తిట్టారు, కొట్టారు. వినకపోయేటప్పటికి గదిలో పెట్టి బందిస్తారు. "తన మనసు ఎందుకు అమ్మాయిలా ఉండాలని కోరుకుంటోంది? శరీరం ఎందుకు అబ్బాయిల పట్ల ఆకర్షితమవుతోంది?" ఈ ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కుంటూ మొదట ఢిల్లీ, అక్కడనుంచి ముంబయి చేరుతారు దొరైస్వామి. ముంబైలో తనలాగే ఆలోచించే వర్గంలో ఒకరిగా జీవితాన్ని ప్రారంభిస్తాడు దొరైస్వామి. తనను తాను మార్చుకోవడానికి తన శరీరాన్నే పెట్టుబడిగా పెట్టి డబ్బు సంపాదిస్తాడు. ఆ డబ్బుతో శస్త్రచికిత్స చేయించుకుని రేవతిగా మారిపోతాడు. ఆ శస్త్రచికిత్స చేసే పద్ధతి ఆమె మాటల్లో వింటే వళ్ళు గగుర్పొడుస్తుంది. రెండేళ్లు ముంబైలోనే గడిపిన తర్వాత కన్న వారిని చూడాలనే ఆశతో ఇంటికి వచ్చిన రేవతిని కన్న తల్లిదండ్రులతోపాటు తోడబుట్టిన వారు కూడా చేరదీయరు. దీనితో రేవతి మళ్ళీ బెంగుళూరు చేరుకుంటుంది. జీవనం కోసం పగలు

ట్రాఫిక్ సిగ్నల్స్ వద్ద భిక్షాటన చేస్తూ రాత్రి సమయాన్ని పడుపు వృత్తితో గడిపేది. ఎన్నోసార్లు పోలీస్ స్టేషనుకు వెళ్ళింది. ఈ క్రమంలో జరిగిన ఒక సంఘటన రేవతి దృక్పధాన్ని పూర్తిగా మార్చేసింది. ఒక రోజు రాత్రి బెంగళూరు కొబ్బన్ పార్కు పోలీసులు రేవతిని పోలీసు స్టేషన్‌కు తీసుకెళ్తారు. స్టేషన్‌లోనే తనను వివస్త్రను చేసి తోటి ఖైదీలతోపాటు పోలీసులూ పైశాచికానందం పొందుతారు. దీంతో ఆమె మనసు పూర్తిగా మారిపోతుంది..“జీవితం అంటే ఇంతేనా.. నేను హిజ్రాను అయినంత మాత్రాన ఈ శరీరం మరొకరి కోరికను తీర్చటానికేనా..నా వల్ల ఎటువంటి ప్రయోజనం జరగదా..” అంటూ పరిపరి విధాల ఆలోచించిన రేవతి అంతవరకూ చేస్తున్న వృత్తిని మానేసి సమాజం నుంచి దూరంగా ఉన్న అనాధలు, వేశ్యలు, హిజ్రాల సంక్షేమంకోసం పనిచేస్తున్న “సంగం” అనే సంస్థ కోసం పనిచేయడం మొదలు పెట్టింది.

ఇదే సూక్ష్మంగా రేవతి అలియాస్ దొరైస్వామి కథ. మనచుట్టూ ఉన్న సమాజం స్త్రీలకు, దళితులకు, మైనార్టీలకు, బలహీనవర్గాలకు, మొత్తంగా మెజారిటీ జనసందోహానికి బాగాలేదని మనకు తెలుసు. కానీ సమాజం మొత్తం మీద కుల మత వర్గాలకు అతీతంగా స్త్రీ పురుషులందరిచేత ఏహ్యానికి, చీదరింపుకి, భయానికి, వెలివేతకు గురవుతున్న హిజ్రాల పట్ల ఈ సమాజం ఎంత క్రూరంగా వ్యవహరిస్తుందో “నిజం చెప్తున్నా..” చదివితే మనకు అర్థం అవుతుంది.

వర్గ సమాజంలో ఆర్థిక స్థితిగతులు మనిషి బతుకును శాసిస్తాయి. కానీ హిజ్రాలు కుటుంబంతో గడపలేని పరిస్థితులవలన ఎంతోకొంత ఆర్థిక వనరులు ఉన్న కుటుంబం నుంచి వచ్చినా ఆ వనరులను అనుభవించలేరు. వారి భౌతిక రూపం, ఆర్థిక వెనుకబాటుతనం, వారిని స్వతంత్రంగా ఉండనివ్వవు. వారికోసం వారు ఏర్పరుచుకున్న సమూహాలలో మాత్రమే వారు బ్రతకగలుగుతారు. అయితే అంతటా విస్తరించిన అవలక్షణాలు వాళ్ళ సమాజాలని కూడా కుదిపేస్తూ ఉంటాయి. కేవలం బ్రతకడం కోసమే అలా సమూహాల్లోంచి ఇంటికీ...ఇంటినుంచి సమూహాల్లోకి పారిపోతూంటారు వీళ్ళు

ఇలాంటి దుఃఖ సముద్రపు అలల ప్రయాణాన్ని రేవతి నిరాలంకారంగా, ఉన్నది ఉన్నట్లుగా ఈ పుస్తకంలో వర్ణించింది. ఆమె సంతోషాలను, ఘర్షణలను, దుఃఖాలను బలహీనతలను నిజాయితీగా చెప్పింది. రేవతి ఈ పుస్తకంలో స్రవించిన జీవిత ప్రవాహానికీ, అక్కడక్కడ తోడయ్యే ఆమె వ్యాఖ్యానాలు, ఆపుకోలేక ఆమె చేసిన ఉద్వేగ ప్రకటనలు మనల్ని కుదిపి దు:ఖంలో ముంచెత్తుతాయి. ఖచ్చితంగా ఈ జీవిత కథ ఈ మాత్రం సౌందర్యవంతంగా ఉండదు. ఈ కథ సుఖాంతం అవ్వదని కూడా మనస్సు చెపుతూనే ఉంటుంది. అయినా ఈ రేవతి ప్రయాణంలో ఉండే భిన్నత్వం, ఆమెకు బతుకులో ప్రతీ మలుపూ చూపించే కొత్త కోణం... చదువుతున్నంతసేపూ మనకి తీవ్రమయిన భావోద్వేగాన్ని కలిగిస్తుంది.

మగవాడిగా పుట్టి స్త్రీ మానసిక ప్రవృతి కలిగి ఉండటం చిన్నతనాన్ని కలిగించే గందరగోళాన్ని అర్థంకావాలంటే ఆమె హృదయాన్ని అక్షరాలతో చూడాల్సిందే. రేవతి తన జీవితాన్నే ప్రదర్శనగా చూపిస్తూ చట్టాలను, రాజ్యాంగ యంత్రాంగాలను చాలా ప్రశ్నలు వేసింది. ఆడపిల్లగా కుటుంబంలో కొంత స్థానం ఉంటుంది. మగపిల్లవాడు సహజంగానే కొన్ని హక్కులు పొందుతాడు. హిజ్రాలు ఇటు కుటుంబంలోనూ, అటు న్యాయస్థానాలలోనూ తిరస్కృతులు అవుతుంటారు. చివరకు రేషన్ కార్డు కోసం, డ్రైవింగ్ లైసెన్సు కోసం కూడా రేవతి ఎంతో పోరాటం చేయాల్సి వస్తుంది. ఒక దశలో అంత పోరాటం చేసే ఆమె విరక్తి చెంది ఆత్మహత్యా ప్రయత్నం చేస్తుంది.

రేవతి గడిపిన కొన్నాళ్ళ వైవాహిక బంధం..అందులో ఆమె అనుభవాలు కూడా మనలో కొన్ని ప్రశ్నలు రేపుతాయి. స్త్రీ తరహా మానసిక ప్రవృత్తితో వాళ్ళు పురుషుల పట్ల ఆకర్షితమవ్వడం..అంతే కాకుండా స్త్రీత్వం అని ఈ సమాజం ఆపాదించిన ప్రతిదీ తాము అనుభవించాలని తాపత్రయ పడడం.. అందులో హిజ్రాలు ఎదుర్కొంటున్న మానసిక వత్తిడి సంఘర్షణా..మనల్ని కుదిపేస్తాయి.

ప్రేమ, పెళ్ళి విషయంలో రేవతి పొందిన వైఫల్యాన్ని, అందువల్ల కలిగిన దు:ఖాన్ని ఆమె తన మనసునుండి పుస్తకంలోకి, పుస్తకం నుండి మన మనసులోకి బదిలీ చేసిందని చెప్పవచ్చు. హిజ్రాలకు ప్రేమోద్వేగాలు ఉంటాయనే విషయం అర్థం అయ్యాక మనం వారిని చూసే దృష్టి తప్పకుండా మారుతుంది.

మనిషి మనుగడ కోసం ప్రకృతిపై పోరాటం చేయాలి. అది సహజం. అవసరం. కానీ ప్రకృతి ప్రసాదించిన శరీరాకృతిపై పోరాటం వాళ్ళకి సర్వస్వమయిపోవటమే ఒక పెద్ద విషాదం.” నిజం చెప్తున్నా..” పుస్తకం రాసిన రేవతి ఒక మంచి రచయిత్రిగా పేరు తెచ్చుకుంది. ఈ సమాజం ప్రభుత్వం కొన్ని రోజులు ఆమె గురించి, ఆమె సమూహాల గురించి కొంత తీరికా, ఓపికా చేసుకుని చర్చించుకున్నాయి. అయితే ఇప్పటికీ ఆమె మళ్ళీ జీవనం కోసం సెక్స్ వర్క్ చేయ వలసి రావడం ఒక కఠిన వాస్తవం. ప్రభుత్వం నిర్లక్ష్యానికి, సమాజ నిర్లిప్తతకీ ఒక నిదర్శనం. ఈ గడ్డ మీద ప్రతీ మానవ పుటకా హుందాయైన బ్రతుకు తెరువు, గౌరవనీయమయిన జీవనం అభయంగా పొందాలి. అలా పొందలేనప్పుడు వందల సమూహాల అస్థిత్వాలు వాటి ఉనికి కోసం ఆక్రోశిస్తాయి. ఆ సమూహాల్లో ఒక సమూహం రేవతి మన కళ్ళ ముందుంచిన ఈ హిజ్రా సమూహం. ఈ పుస్తకం చదివాకయినా ఈ సమూహాల పట్ల వాళ్ళు చేస్తున్న పోరాటాలపట్ల ఒక సానుకూల వైఖరి ఏర్పరచుకోగలితే రేవతి కృషి ఫలించినట్లే. ◆

# గురజాడ స్ఫూర్తితో.... మహిళలపై హింసను అధిగమిద్దాం

## ఐక్యవేదిక ఆధ్వర్యంలో రాష్ట్రవ్యాప్త కార్యక్రమాలు

నూట యాభయ్యవ జయంతిని ఘనంగా నిర్వహించుకున్న ఆంధ్రరాష్ట్రం నూరవ శత వర్ధంతి సందర్భంగా గురజాడకు మహోన్నత నివాళినర్పించింది.



ఆధునిక స్త్రీ చరిత్ర లిఖిస్తుందన్న దూరదృష్టిని, అనమానతలు లేని సమాజావిష్కరణను కలలుగన్న గురజాడ అడుగుజాడలలో అడుగు కలిపేందుకు చిన్నారుల నుండి తలపండిన కవిశ్రేష్ఠుల వరకు ముందుకువచ్చారు.

ఆర్థిక విధానాలలో వచ్చిన మార్పులు మహిళా జీవితాలను ఆగం చేస్తున్నాయి. సాంస్కృతిక క్షీణత అడుగడుగునా సాక్షాత్కరిస్తుంది. ఢిల్లీలో ఉద్యోగిని, హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ యువతి, ఏలూరులో 7 ఏళ్ళ పసికందు, తిరుపతిలో కన్నకొడుకే తాగుబోతై కన్నుగానని కామంతో తల్లిని బలిగొన్నాడు.

మహిళలపై ఇంటా బయటా హింస పెరిగిన నేపథ్యంలో "గురజాడ స్ఫూర్తితో మహిళలపై హింసను ప్రతిఘటిద్దాం" అన్న పిలుపుతో ఐద్వా విస్తృత కార్యక్రమాలను నిర్వహించింది.

గురజాడ జయంతి సెప్టెంబరు 21న మొదలుపెట్టి శత వర్ధంతి నవంబరు 30 వరకు అవిచ్ఛిన్నంగా పాఠశాలల్లో, విద్యాలయాల్లో ఆయా ప్రాంతాలలో సభలు, సాహితీగోష్టులు, గీతాలాపన తదితర కార్యక్రమాలలో పిల్లలు, పెద్దలు పాల్గొన్నారు.

కార్యక్రమాల నిర్వహణ కోసం 24 సంఘాలు 10మంది మేధావులతో కలసి ఐక్యవేదిక ఏర్పడింది. గురజాడ రచనలన్నింటా స్త్రీల సమస్యలను సృజించారు. ఆత్మవిశ్వాసానికి ప్రతీకగా, సమస్యలను అధిగమించే ప్రయత్నం చేసిన అతివలుగా, అన్యాయాలను ప్రతిఘటించే వ్యక్తులుగా, మానవతా మూర్తులుగా చిత్రీకరించారు. ప్రస్తుత నేపధ్యంలో స్త్రీల సమస్యలను ప్రస్తావిస్తూ గురజాడ రచనలలో స్త్రీ పాత్రల విశ్లేషణతో వచ్చిన లబ్ధ ప్రతిష్ఠులైన రచయితల వ్యాసాలను " దార్శనికుడు గురజాడ" పేరుతో ఐద్వా ప్రచురించింది. ఈ సంకలనం మంచి ఆదరణ పొందింది.

సెప్టెంబరు '21' న ఆయా పాఠశాలల్లో గీతాలాపన చేశారు. ప్రతిజ్ఞా కార్యక్రమాన్ని నిర్వహించారు. విజయనగరం జిల్లాలో మహిళా సంఘం, ఉపాధ్యాయ సంఘాలు అత్యధిక పాఠశాలల్లో గీతాలాపన చేసి గురజాడకు ఘన నివాళి అర్పించారు. రాష్ట్రవ్యాపితంగా ప్రతి జిల్లాలోనూ సెమినార్లు నిర్వహించి విద్యార్థులలో గురజాడ నవ్యమార్గాన్ని చర్చనీయాంశం చెయ్యగలిగాం.

తదనంతరం ఏర్పడిన ఐక్యవేదిక కాలేజీలలో సెమినార్లు, సదస్సులు నిర్వహించాలని, స్కూళ్లల్లో గీతాలాపన చెయ్యాలని, వ్యాసరచన, వక్తృత్వ మరియు పాటల పోటీలు నిర్వహించాలని, 20 నుండి 30 వరకు ప్రదర్శనలు, సభలు నిర్వహించాలని కార్యాచరణ రూపొందించుకున్నాం.

అనంతపూర్‌లో ఐద్వా, ఎస్ఎఫ్ఐ, సాహితీ స్రవంతి కలిసి ప్రత్యేకంగా కవులు, రచయితలను ఆహ్వానించారు. వారి ఆధ్వర్యంలో ఆగస్టు 22న 4 విభాగాలుగా రోజంతా గురజాడ రచనల్లోని విశిష్టత ప్రస్తుత సమాజానికి కూడా ఏవిధంగా అవసరమో ఆసక్తికరమైన చర్చ జరిగింది. అనేకమంది కవులు, రచయితలు పాల్గొన్న ఈ సభలో సింగమనేని ఆధ్వర్యంలో రాచపాళెం, డా॥ శ్రీదేవి, సంజీవమ్మ లాంటి అనేకమంది పెద్దలు పాల్గొనడం సాహితీ అభిమానులతోపాటు అభ్యుదయ మేధావులకు కూడా ఉత్సాహాన్ని కల్గించింది.

తిరుపతి పట్టణంలో జయంతి రోజున 2,500 మంది విద్యార్థులతో బహిరంగంగా దేశభక్తి గీతాన్ని ఆలపించి శతవర్ధంతి కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. మహిళా రచయితలను తిరుపతి పట్టణంలో వివిధ రంగాలలో ప్రముఖులుగా ఉన్న మహిళలను, ఆయా కళాశాలల ప్రిన్సిపల్స్, తెలుగు అధ్యాపకులు, వివిధ సంఘాలను కలుపుకుని ఐక్యవేదిక ఏర్పడింది. దాదాపు నెల రోజులుపాటు ఆయా విద్యాలయాల్లో విద్యార్థులకు పోటీలు,

సభలు ఏర్పాటు చేశారు. వదిలిపెట్టని వర్షాలు ఆటంకం కల్గించినా తిరుపతిలోని మహతి స్టేడియం వేలాదిమంది విద్యార్థులు సభకు హాజరై అపూర్వ సన్నివేశాన్ని ఆవిష్కరించారు. పుత్తడి బొమ్మ పూర్ణమ్మ నృత్యాభినయంతో ప్రారంభమైన సభ ఆద్యంతము ఆసక్తిగా సాగింది. కొలకలూరి మధుజ్యోతి గారు ప్రారంభించిన ఈ సభలో తెలుగు భాషా సమితి అధ్యక్షులు శ్రీదేవి, ప్రముఖ వైద్యులు ప్రశాంతి, కళాశాల కరస్పాండెంట్ సుచరిత మరెందరో ప్రముఖులు ఈ సభలలో భాగస్వాములయ్యారు. ప్రజానాట్యమండలి, యువజన సంఘం, ఐద్వాతో పాటు ఈ సభలు జయప్రదం చేయటానికి కృషి చేశారు.




సాహితీ స్రవంతి ప్రత్యేక చొరవతో శ్రీకాకుళంలో అత్యంత ఉత్సాహపూరితంగ ఉత్తరాంధ్ర ప్రముఖులందర్నీ భాగస్వాములను చేసి సభను బ్రహ్మాండంగా నిర్వహించారు.

గురజాడ మనవరాలు... ఆధ్వర్యంలో ఏర్పడిన వేదిక ఆధ్వర్యంలో విజయనగరం జిల్లా వ్యాపితంగా కార్యక్రమాలు నిర్వహించడమేగాక 25నుండి 30వ తేదీ వరకు విజయనగరంలో వివిధ కార్యక్రమాలు జరుగుతూనే ఉన్నాయి. ప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగిన సభలో పాల్గొన్న మంత్రివర్యులు పల్లె రఘునాధరెడ్డి గారు గురజాడ గీతాన్ని రాష్ట్ర గీతంగా ప్రకటిస్తుందని హామీ ఇచ్చారు.

విశాఖ నగరంలో 169 సంఘాలు కలిసి నవంబరు 29న ఆంధ్రా యూనివర్శిటీలో సభను అత్యంత ఉత్సాహంగా నిర్వహించారు. ఉత్తరాంధ్ర ప్రముఖులే గాక రాష్ట్రంలోని ప్రముఖులంతా పాల్గొని ప్రముఖ రచయిత్రి ఓల్గా, తెలకపల్లి రవి, డా॥ జగధాత్రి, అరసం, విరసం ప్రముఖులు, మెడిపల్లి రవికుమార్, కుప్పం యూనివర్శిటీ నుండి శ్రీదేవి తదితరులందరూ పాల్గొని అనేక అంశాలను చర్చనీయాంశం చేయడమే గాక నిరంతరం ఉత్తేజపరచే ప్రజాశక్తి బుక్ హౌస్ ప్రచురించిన గురజాడ రచనలు ఆవిష్కరణలు జరిగాయి. ప్రజానాట్యమండలి ప్రదర్శించిన కళారూపాలు ఆకట్టుకున్నాయి. గురజాడ పుట్టిన రాయవరం నుండి, గురజాడ కేంద్రంగా మారిన రాజాం వరకు ఆంధ్రరాష్ట్రంలో అన్ని ప్రాంతాలలో జరుపుకోవడమేగాక ఈ శతవర్ధంతిని ఢిల్లీలోని ఆంధ్రాభవన్‌లో కూడా జరుపుకుని సంపూర్ణత్వాన్ని సమకూర్చుకున్నాం.

ప్రజాస్వామిక రచయితల సంఘం కార్యదర్శి కె.న్. మల్లీశ్వరి, కథా సాహితి ఎడిటర్, వాసిరెడ్డి నవీన్, సింగమనేని తదితర పెద్దలు, వివిధ రంగాలలోని ప్రముఖులు, అన్ని మహిళా సంఘాలు ఈ కార్యక్రమాలన్నింటా భాగస్వాములయ్యారు.

ఈ సందర్భంగా నిర్వహించిన కథల పోటీలలో 36 మంది రచయితలు తమ రచనలను పంపించారు.

జయంతి సందర్భంగా 26 కాలేజీలు 8,500 మంది సెమినార్లలో పాల్గొనగా నవంబరు 30 వరకు 460 విద్యాసంస్థలలో లక్షమందికి పైగా విద్యార్థులు ర్యాలీలలో, గీతాలాపనలో పాల్గొన్నారు.

ఈ కార్యక్రమాలలో పాల్గొన్న సాంప్రదాయవాదులనుకున్న వారు కూడా గురజాడ నవ్య మార్గమే నేటి మార్గమని అదే భారతీయ సాంప్రదాయమని నొక్కి వక్కాణించారు.

వామపక్ష ఉద్యమాభిమానులందరూ మనస్ఫూర్తిగా ఈ కార్యక్రమాలలో వివిధ రూపాలలో భాగస్వాములయ్యారు.

గురజాడను 'టార్చ్‌లైట్' గా, 'మార్గదర్శి' గా ముందుకు సాగాలనే భావన అన్ని చోట్లా వ్యక్తమయింది. గురజాడ రచనలను పాఠ్యాంశాలలో భాగంగా ఉండాలని ఆకాంక్షించారు. జాతీయగీతం గానే కాదు అంతర్జాతీయ గీతంగా ఉండదగిన దేశ భక్తి గీతాన్ని రాష్ట్ర గీతంగా నైనా ప్రకటించాలన్న కోర్కె బలపడింది.

ఐద్వా కృషిని అందరూ అభినందించటమే గాక ఆయా కళాశాలలోని మహిళా అధ్యయన వేదికలలో ఐద్వా భాగస్వామిగా ఉండాలని కోరారు. విజయవాడలోని కె.బి.న్ కళాశాల ఐద్వాతో mou చేసుకున్నది. ఐద్వా కార్యచరణకు తమ కలం తోడుగా ఉంటుందని తద్వారా కులం, మతం, ఆడ మగా లాంటి అసమానతలను అధిగమించి "ఎల్లలోకములొక్క ఇలై" సమభాగం సమభావంగా ముందుకడుగు వేద్దామని ఎందరో స్త్రాహితీ మిత్రులు ముందుకు వచ్చారు. ఈ కార్యక్రమాన్ని కొనసాగించాలి. మహోన్నత రచనల అమృత ఫలాల్ని అందుకోవాలని ఐద్వా ఆకాంక్షిస్తూ ఈ మహత్తర కృషిలో భాగస్వాములైన అందరికీ నమస్సుమాంజలులు అర్పిస్తుంది. ◆

నివాళి

# ఉద్యమ కిరణం తిప్పాని లక్ష్మి

మానవత్వం, మమకారం ఉట్టిపడే వ్యక్తిత్వం లక్ష్మిది. ఆ నిండు స్వరూపం, ఆమె సేవా నిరతి, ప్రజాతంత్ర ఉద్యమాన్ని ఎంతో భరోసానిచ్చింది. సోదరి లక్ష్మి 23-11-15న అనారోగ్యంతో ఏలూరులో మరణించారు.

అది పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు పట్నం. లక్ష్మి ఇల్లు చాలా దూరం. కాలువ గట్టున నడిచి వెళ్ళాలి. మహిళా ఉద్యమంలో జిల్లా కమిటి సభ్యురాలిగా జిల్లా కేంద్రమైన ఏలూరు పట్నంలో జరిగిన అనేక ప్రజా ఉద్యమాల్లో పాల్గొనేవారు లక్ష్మి. అది 1990వ సంవత్సరం ఫిబ్రవరి నెల. కార్మిక మహిళలకు ప్రసూతి సహాయనిధి ప్రభుత్వం నుండి అందించే కార్యక్రమం. నెల రోజులపాటు ఏకధాటిగా ఆ కార్యక్రమం ఒక మహా యజ్ఞం వలె సాగింది. పేటలలోని కార్మిక కుటుంబాలలోని గర్భిణీ స్త్రీల (2వ కాన్పు అయితేనే) పేర్లు సేకరించాలి. వారిని ప్రభుత్వ మెటర్నిటీ హాస్పటల్‌కి తీస్కెళ్ళి పరీక్ష చేయించి, డాక్టరు సంతకం తీస్కొని స్త్రీ శిశు సంక్షేమ శాఖ జిల్లా అధికారి ద్వారా, కార్మిక మహిళలు మహిళా కమిటీ సభ్యులు దగ్గరుండి ప్రసూతి సహాయనిధి 120 రూ॥లు ఇప్పించాలి. రోజుల తరబడి పేటలలో ఉదయమే ఇళ్ళకు తిరగటం, ఏ ఆధారం లేక సుస్తీగా ఉన్న మహిళలను దగ్గరుండి (నడిచి రాలేనివాళ్ళను) రిక్షాలలో తీస్కెళ్ళటం, చాలా కష్టమైన కార్యకమం పట్టణంలో ఎంతో బాగా జరిగింది, లక్ష్మి తన ఏరియాలో 150 మంది గర్భిణీ స్త్రీలకు ప్రసూతి సహాయనిధి అందేలా చూసి మొదటి స్థానంలో నిలిచారు. తాన సింహాచలం బోడిదిబ్బ ఏరియాలో 134 మంది గర్భిణీ స్త్రీలకు అందించి 2వ స్థానంలో నిలిచారు. లక్ష్మి, కృష్ణ దంపతుల బిడ్డలు 5గురు శారద, టాన్యా, నిర్మల, శాంతి, కొడుకు దీన్నా. ఏలూరులో వరదలు వచ్చి చేనేత కార్మికుల మగ్గాలు, ఇళ్ళు మునిగిపోయాయి. మహిళా సంఘం తరపున వరద బాధితులకు విరాళాలు వసూలు చేసి చేనేత కుటుంబాలను ఆదుకోవటంలో లక్ష్మి చేసిన కృషి మరువలేనిది.



తోటి మానవాళి సంక్షేమం కోసం ఉడతాభక్తి ఎంతో కొంత సేవచేయాలి కదా? మన మహిళా ఉద్యమం ద్వారా నాకు ఈ అవకాశం వచ్చింది అని ఎంతో కృతజ్ఞతగా తన ఆలోచన చెప్పేవారు. ఇంట్లో ఇబ్బందులు, బయటకు రావటం కష్టం అనే మాటలే ఆమె నోట వినలేదు. ఎప్పుడూ ఉత్సాహంగా నిండుకుండ వలె ఉద్యమంలో నిలిచి మహిళా ఉద్యమాన్ని ఎంతో భరోసానిచ్చిన లక్ష్మి వ్యక్తిత్వం,ఆమె సేవా సంస్కారం మనందరికీ విలువైన సందేశం.

కార్యకర్తలు మరింత శక్తివంతమైన ఉద్యమాలు నిర్మించగలరనే ఆశలతో లక్ష్మి వలె మన ఉద్యమాలలో లక్ష్మితో కలిసి సేవలందించిన తాన సింహాచలం, గౌడ వెంకాయమ్మ. వాలేటి ఆదెమ్మ, పడమర వీధి విజయ, ఝాన్సీ, లక్ష్మి గారలు కనుమరుగైపోయారు. సమాజానికి జన్మనిచ్చిన తల్లులంగా అవినీతి, దోపిడీ శక్తుల అంతాన్ని మన బిడ్డల బంగారు భవిత కోసం బలమైన ప్రజాఉద్యమాల నిర్మాణంలో ముందు నిలిచిన అమరులకు నివాళులు.

సహచరి తిప్పాని లక్ష్మికి నివాళులతో

అల్లూరి మన్మోహిని. ◆

# హింస — రాష్ట్రంలో మహిళలపై పోలీసుల కీచకపర్వం

గుంటూరు జిల్లాలోని బెల్లంకొండ ఎఎస్ఐ తన బంధువు శ్రీనివాసరావుతో కలసి అచ్చంపేట మండలం కొత్తపల్లి గ్రామానికి చెందిన ఒక పేద రైతు మహిళపై మత్తు మందిచ్చి, అత్యాచారం చేసి, వీడియో తీసి ఆమెను వేధిస్తున్న ఘటన నవబంరు 21న వెలుగులోనికి వచ్చింది.





రాజధాని నగరంగా ఉన్న విజయవాడలో దుర్గ అనే దళిత మహిళ పని నుంచి తిరిగి వచ్చే సమయంలో ఆకతాయిలు వెంటపడగా వారినుంచి రక్షించాల్సిన ఎస్సై ఆ మహిళపైనే దాడి చేయటం, కొట్టటం మహిళల ఎడల పోలీసుల దుర్మార్గ వైఖరికి అద్దం పడుతుంది. పోలీసు కమీషనరుకు ఫిర్యాదు చేయడానికి పూనుకున్న ఆ మహిళపై మరోసారి లాఠీఛార్జీ చేయటమే కాక వివస్త్రను చేసి, కులంపేరుతో తిట్టి ఆమె కూలి డబ్బులు లాక్కొని బలవంతంగా నోట్లో మద్యంపోసి తప్పుడు కేసులు పెట్టి వ్యవహరించినట్లు ఆ మహిళ అందరి సమక్షంలో తనకు జరిగిన అన్యాయాన్ని తెలియచేసింది. ఆమె పై కేసు ఎత్తివేసుకోమని ఒత్తిడి చేస్తున్నారు. ఆమెపై తిరుగుబోతు ముద్రవేసి నైతికంగా బలహీనపర్చే ప్రయత్నం సాగిస్తున్నారు. రమీజాబి ఉదంతాన్ని మరోసారి టిడిపి పాలన గుర్తుచేస్తున్నది.

తూర్పు గోదావరి జిల్లా కాకినాడ వన్‌టౌన్ పోలీసు స్టేషన్‌లో డ్యూటీ చేస్తున్న మహిళా హోమ్ గార్డు కూడా తన పై అధికారి నుండి లైంగికంగానూ, మానసికంగా, శారీరకంగా బాధలు పడుతూ పై అధికారి పెడుతున్న చిత్ర హింసలను వివరించింది. తన అనారోగ్యం, తాను అధికారి ఇంట్లో చేయవలసిన పనుల చిట్టాను, చెప్పనలవికాని విధంగా లైంగికంగా చిత్ర హింస పెడుతున్నట్లు ఆ పిటిషన్‌లో పేర్కొన్నది.

ఈ ఘటనలపై తక్షణం ఉన్నతాధికారులు స్పందించాల్సి ఉంది. రక్షించాల్సిన పోలీసు అధికారులే తమ అధికారాలను దుర్వినియోగం చేసి వ్యవహరిస్తున్న తీరు తీవ్ర ఆందోళన కలగచేస్తున్నది. మహిళలపై అత్యాచారం, దాడులు నేరాలు కావా? ఇలాంటి నేరాలు పోలీసు అధికారులు చేసినప్పుడు ఎఫ్ఐఆర్ నమోదు చేయాల్సిన అవసరం లేదా? వారిని తమ అధికార బాధ్యతలోనే ఉంచి విచారణ జరిపితే న్యాయం జరుగుతుందా? ఇంకెంత మంది మహిళలు బలి కావాలి? ఇంకా బయటకు రాని ఇలాంటి ఘటనలు ఎన్నో. పోలీసు (రక్షణాధికారి) అనే పదానికే కళంకంగా మారుతున్నాయి. ◆

## మహిళా రైతుపై సామూహిక అత్యాచారం

### నిందితుల్లో ఎఎస్ఐ, ఆలస్యంగా వెలుగులోకి

ప్రజాశక్తి-బెల్లంకొండ (గుంటూరు)

మహిళా రైతు సామూహిక లైంగిక దాడికి గురైన సంఘటన గుంటూరు జిల్లా బెల్లంకొండలో ఆలస్యంగా వెలుగు చూసింది. నిందితుల్లో ఒకరు ఎఎస్ఐ కావడం గమనార్హం. దీనిపై పిడుగురాళ్ల రూరల్ సిఐ శ్రీధర్‌రెడ్డి శనివారం తెలిపిన వివరాలిలావున్నాయి. అచ్చంపేట మండలం కొత్తపల్లికి చెందిన మహిళ తన పొలంలో వేసిన బోరుబావికి విద్యుత్ కనెక్షన్ కోసం అదే గ్రామానికి చెందిన మందపాటి శ్రీనివాసరావు సాయం కోరింది. అందుకు అంగీకరించిన శ్రీనివాసరావు తన బావ బెల్లంకొండ ఎఎస్ఐ అని, పని సులువుగానే అవుతుందని నమ్మించి ఆమెను బెల్లంకొండలోని ఎఎస్ఐ ఏలూరి శ్రీనివాసరావు ఇంటికి తీసుకెళ్లాడు. అక్కడ శీతల పానీయంలో మత్తుమందు కలిపి తాగించి ఆమెపై ఇద్దరూ అత్యాచారం చేశారు. ఈ ఘటనను వీడియో, ఫోటోలు తీసి బెదిరిస్తుండడంతో బాధితురాలు ఈ నెల14న బెల్లంకొండ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేసింది. దీంతో ఆమెను వైద్య పరీక్షల కోసం ఆదివారం గుంటూరుకు పంపి కేసు దర్యాప్తు చేస్తున్నామని సిఐ తెలిపారు.

ప్రజాశక్తి Sun, 22 November 2015
epaper.prajasakti.com/c/7.

కథ

# అంతిమం

గురజాడ శత వర్ధంతి సందర్భంగా గురజాడ స్ఫూర్తితో ఐద్వా నిర్వహించిన కథల పోటీలో మూడవ బహుమతి పొందిన కథ

- మానస ఎండ్లూరి

రాధమ్మ చెంప ఛెళ్ళుమంది!

కింద పడిన ఆమె పైకి లేచి సర్దుకుని ఆరేళ్ళ కూతురి గొంతుకి కత్తి పెట్టింది!!

"ఇదిగో ఇయ్యాల్తో నీ ఆటలు కట్టిపెట్టు! యాతనైపోయింది నీతో! అటో ఇటో తేలిపోవాలి నీ సంగతి సెప్తున్నా!

నా కాడ డబ్బుల్లేవు నీతో యాగలేను, దీన్ని సంపేసి నానూ సత్తాను! వని సేసి నాలుగు డబ్బులు యనకేసుకొద్దావని లేదూ?

పిల్లని బళ్ళో సేర్పియ్యాల. నీ డబ్బులూ నీ తాగుడుకే తగలెడతావు. తాగుబోతు సచ్చినోడా నీ జిమ్మడ!" భర్త సత్తిబాబుని మాటల్తోనే ఉతికి పారేసింది రాధమ్మ.

"ఏటే? ఏటీ? ఇయ్యాల రొండో తేదీ! డబ్బులొత్తాయని నాకు తెల్దనుకున్నావా? ముండ కానా! ఇత్తావా సత్తావా? నిన్ను సంపేసినా పాపం లేదే ఎదవ కానా! తియ్యే డబ్బులీ!" తూగిపోతూ అన్నాడు సత్తిబాబు.

అసలే తాగున్నాడు. అన్నంత పని చేయకపోయినా భార్యని చావబాదుతాడు. రాత్రంతా భార్యను కొట్టి పొద్దటికి కాళ్ళు పట్టుకుంటాడు. పగలంతా చాలా మంచిగా ఉంటాడు. సాయంత్రానికి మళ్ళీ మామూలే!

వృద్ధురాలైన తల్లంటే ప్రాణాలిచ్చేంత ప్రేమ! ఈ వయసులో కూడా ఆమె కొడుకు సత్తికి అన్నం తినిపిస్తుంటుంది!

అలాగే కూతురంటే కూడా ప్రాణం. ఆ పిల్లని బళ్ళో చేర్పించాలని అతనికి ఉంది కానీ తాగుడికి బానిస కావడడం వల్ల డబ్బులు తగలేస్తున్నాడు. అయితే, పెళ్ళాం దగ్గర అజమాయిషీ చెయ్యడానికి ముందే తాగి వస్తాడు! అతడి కూతురు చిన్నది ఏమీ అర్థం చేస్కోలేని వయసు! నాన్నా ఎందుకు పగలంతా ప్రేమగా ఉంటాడో సాయంత్రం అయ్యేసరికి అమ్మనెందుకు కొడతాడో తెలీదు! రాధమ్మ ఆరిళ్ళలో రోజంతా పని చేస్తూనే ఉంటుంది. కానీ ఆ డబ్బంతా సత్తి బాబే దోచేస్తాడు. కూతుర్ని స్కూల్ యూనిఫాంలో చూడాలనీ, తమ బతుకులు మారాలనీ రాధమ్మ ఎన్నో కలలు కంటోంది. సత్తిబాబు సరిగ్గా ఉంటే అన్నీ బానే ఉండేవి!

" ఆ దొరికాయి పోయే! నువ్వేటి ఇచ్చేది గోంగూర కట్ట!"

రాధమ్మ బొడ్లో దోపుకున్న డబ్బులు చటుక్కున తీస్కోని పారిపోయాడు సత్తిబాబు.

ఇక రాధమ్మ ఏడవడం, కూతురు తల్లి కళ్ళు తుడవడం షరా మామూలే!

రాత్రి పది దాటుతోంది సత్తిబాబు, అతడి స్నేహితులు నలుగురు తప్ప తాగి సారాయి అంగడి ముందు మట్టిలో దొర్లుతున్నారు. ఒకరితో ఒకరు సంబంధం లేకుండా ఏవేవో మాట్లాడుకుంటున్నారు. అంగడి మూసేస్తూ 'ఎవరి దారిన వాళ్ళు పోండ్రా!' అని అరిచాడు యజమాని రోజు ఆ కూత విననిదే సత్తిబాబుకి, అతడి స్నేహితులకి వెళ్ళాలని తోచదు. మెల్లగా

*"ఒరే సత్తిగా ఎదర సూడ్రా! ఏదో వత్తుంద్రా...తెల్లగా!!"* తాగిన మైకంలో ఎదురుగా ఉన్న దాన్ని గుర్తుపట్టలేక అన్నాడు ఒకడు.

*"ఎల్లెహే! ఏటీ లేదు! పిరికి నాయాలా!"*

*"అవున్రా ఎవరో మనిషిరోయ్!"*

*"ఆ! మనిసి కాదు రా! ఆడ మనిసి!!"* కన్ను కొడుతూ అన్నాడు సత్తిబాబు.

*"ఇంత రేత్రి కాడ ఆడమనిషి రోడ్డు మీద ఎందుకుంటుంది రా సోది నా కొడకా!"*

*"రేయ్! ఎందుకుందో అడుగుదాం పదండ్రా!"* అన్నాడు సత్తిబాబు.

ఒకరిని ఒకరు పట్టుకుని పడుతూ లేస్తూ నిలబడ్డారు. అక్కడికి సగం పనైంది! ఇక కిలోమీటరు దూరంలో ఉన్న ఇళ్లకి చేరుకోవాలి. ఇది వారికి అలవాటైన పనే! రెండో తారీఖు కదా! ఒకటో తేదీ వచ్చిన జీతమంతా పీకల్లోతు తాగేశారు! తప్పు తాగిన తప్పటడుగులు అసౌకర్యాన్ని కలిగిస్తున్నాయి. బాగా చీకటి పడింది. దాదాపు ఎవరూ లేరు రోడ్డు మీద. అంతా నిర్మానుష్యం! నిశ్శబ్దం!

"ఒరే సత్తిగా ఎదర సూడ్రా! ఏదో వత్తుంద్రా...తెల్లగా!!" తాగిన మైకంలో ఎదురుగా ఉన్న దాన్ని గుర్తుపట్టలేక అన్నాడు ఒకడు.

"ఎల్లెహే! ఏటీ లేదు! పిరికి నాయాలా!"

"అవున్రా ఎవరో మనిషిరోయ్!"

"ఆ! మనిసి కాదు రా! ఆడ మనిసి!!" కన్ను కొడుతూ అన్నాడు సత్తిబాబు.

"ఇంత రేత్రి కాడ ఆడమనిసి రోడ్డు మీద ఎందుకుంటది రా సోది నా కొడకా!"

"రేయ్! ఎందుకుందోఅడుగుదాం పదండ్రా!" అన్నాడు సత్తిబాబు

ఒకరి భుజాల మీద ఒకరు చేతులేసుకుని ఐదుగురూ ముందుకి నడిచారు.

"ఒరేయ్! పక్కనే తుప్పల్లోకి తీస్కెళ్ళి పని కానిచ్చేద్దాం! ఎవడో అన్నాడు

సత్తిబాబుకి ఆ ఆలోచన మనసులో నాటుకుంది.

"అయినా ఇంత రేత్రి కాడ ఆడదానికి బైట పనేట్రా!? దాన్ని పాడుసేసి గుట్టు చప్పుడు కాకుండా ఇళ్ళకెల్లిపోదాం! ఎవలికి సెప్పొద్దు!!

సత్తిబాబు అందరి మాటలూ వింటున్నాడు. అందరికన్నా ముందు నడిచాడు. ఆ ఆడమనిషి వద్దకు పరుగులాంటి నడకతో చేరుకున్నాడు. చిమ్మ చీకటి! ఎవరూ దరిదాపుల్లో లేరు! ఆమె విదిలించుకోడానికి ప్రయత్నం చేస్తుంది. ఐదుగురూ చాలా బలంగా పట్టుకున్నారు ఆమెను. సత్తిబాబు ఆమెను గట్టిగా కొడుతూనే ఉన్నాడు. ఆమె తెల్లని చీర మొత్తం రక్తమయమైంది. సత్తిబాబు ఆమెను పాడుచేసి మత్తుగా పడిపోయాడు మిగతా నలుగురూ ఒకరి తర్వాత ఒకరు అఘాయిత్యం చేసి, ఆమె ప్రతిఘటించినందుకు చితకబాదారు!

ఆ నలుగురూ సత్తిబాబుని లేపి ఇళ్ళకు బయల్దేరారు. మార్గమధ్యలో వారంతా వేరే వేరే దారుల్లో వెళ్ళిపోయారు. సత్తిబాబు మధ్యలోనే నడవలేక పడిపోయాడు.

◆◆◆

సూర్యోదయం! ఎండ సరాసరి సత్తిబాబు ముఖంపై పడుతూ వుంది. అతడికి కళ్ళు చురుక్కుమని తెరుచుకున్నాయి. నలుపుకుంటూ లేచే ప్రయత్నం చేశాడు. రోడ్డు మీద గోడ పక్కన చెత్తలో పడుకున్నాడు. ఓ కుక్క అతని పక్కనే మల విసర్జన చేయబోతుంటే దాన్ని తరిమి ఒక్కసారిగా లేచాడు. ఒళ్ళంతా విరిచి పెద్దగా ఆవలిస్తూ ఇంటి బాట పట్టాడు. ఇంటి దగ్గర గుంపులు గుంపులుగా జనం కనబడ్డారు. సత్తిబాబు పెద్దగా పట్టించుకోలేదు. వాళ్ల పేటలో ఏ చిన్న విషయం జరిగినా జనం పోగవడం సాధారణం. జనంలోంచి ఇద్దరు పోలీస్ కానిస్టేబుల్స్ సత్తిబాబు దగ్గరగా వస్తున్నారు...

'ఏటీ! కొంపదీసి నా ఇంటిది కానీ నున్ను పోలీసోళ్ళకి పట్టిత్తుందా?" ఆశ్చర్యపోతూ అనుకున్నాడు సత్తిబాబు.

"ఏమయ్యా! నువ్వేనా సత్తిబాబంటే!" అతడి అవతారం చూసి

**"ఏమయ్యా! నువ్వేనా సత్తిబాబంటే!" అతడి అవతారం చూసి ఎంతో జుగుప్సగా అడిగారు కానిస్టేబుల్స్.**

**"అవునండయ్యా!" చేతులు కట్టుకుని వినయంగా సమాధానమిచ్చాడు.**

**"పద పద" అంటూ గుంపులోంచి అతడి ఇంటి ముందుకు తీసుకెళ్ళానే. సత్తిబాబు చూసింది నమ్మలేకపోయాడు! ఉన్న అడుగు మడుగు మత్తు కూడా వదిలిపోయింది! నోటివెంట మాటలేదు! రాధమ్మ, తన కూతురు చిన్ని వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. తన పేట వాళ్ళే కాక, చుట్టుపక్క వాళ్ళు కూడా గుమిగూడారు. అందరూ సత్తిబాబునే చూస్తున్నారు. అతడు మాత్రం ఎదురుగా శవంగా పడి ఉన్న తన తల్లి పిచ్చమ్మనే చూస్తున్నాడు.**

ఎంతో జుగుప్సగా అడిగారు కానిస్టేబుల్స్.

''అవునండయ్యా!'' చేతులు కట్టుకుని వినయంగా సమాధానమిచ్చాడు.

"పద పద" అంటూ గుంపులోంచి అతడి ఇంటి ముందుకు తీసుకెళ్ళారు. సత్తిబాబు చూసింది నమ్మలేకపోయాడు! ఉన్న అడుగు మడుగు మత్తు కూడా వదిలిపోయింది! నోటివెంట మాటలేదు! రాధమ్మ, తన కూతురు చిన్ని వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. తన పేట వాళ్ళే కాక, చుట్టుపక్కల వాళ్ళు కూడా గుమిగూడారు. అందరూ సత్తిబాబునే చూస్తున్నారు. అతడు మాత్రం ఎదురుగా శవంగా పడి ఉన్న తన తల్లి పిచ్చమ్మనే చూస్తున్నాడు.

"అమ్మా...!" ఒక్క అరుపుతో తల్లి శవం మీద వడి ఏడవడం మొదలుపెట్టాడు సత్తిబాబు. చిన్ని ఆ అరుపుకి బెదిరిపోయింది! అతని ఆర్తనాదాలు ఆకాశాన్నంటాయి.

"ఒసేయ్ రాధమ్మా! ఏంటైందే మాయమ్మకి? నిన్నటి దాకా బానే ఉంది కదెటే! నిన్న సందలడేకాడికి దుర్గమ్మత్త ఇంటిగ్గూడా నడిసిపోయింది కదే?" గుండెలవిసేలా ఏడుస్తూ అడిగాడు సత్తిబాబు.

"అంతా నీ వల్లే రా తుప్పాసెదవ!" రాధమ్మ కట్టలు తెంచుకున్న కోపంతో అరిచింది.

సత్తిబాబు అవాక్కయ్యాడు! ఓ పోలీసు సత్తిబాబుని పక్కకు పిలిచి....

"మీ అమ్మని కొంతమంది గ్యాంగ్ రేప్ చేశారయ్య!"

''ఏంటండీ?'' అర్థం కానట్టు అడిగాడు సత్తిబాబు.

"అదేనయ్యా! కొంతమంది పాడు చేశారు!"

సత్తిబాబు తన తల్లికి ఏ గుండెపోటో, యాక్సిడెంటో అయ్యుంటుందని అనుకుంటున్నాడు. పోలీసు చెప్పిన సంగతి విని నిర్ఘాంతపోయాడు! వెంటనే రాధమ్మ దగ్గరకు పరుగెత్తాడు.

"ఏటి రాధమ్మ? మాయమ్మని పాడుచెయ్యడమేమిటే"? ఏడుస్తూ అడిగాడు.

"అవునయ్యా! అద్దరేత్రి కాడ రోడ్డు పక్క పొదల్లో పడుంటే యంకటేశు, రమేసు చూసి ఎత్తుకొచ్చారు! ఆసుపత్రికి తీస్కెళ్లి పోలీసుల్ని పిలిపించి ఏటేటో సేసారయ్యా!" దు:ఖం పొంగుకొస్తుంది రాధమ్మకు.

"తప్పుడు మాటలాడకే రాధమ్మ! నీరేత్తాను! మా అమ్మ రేత్రి కాడ రోడ్లమ్మట ఎందుకే తిరుగుతది?"

"నీ వల్లేనయ్యా!!!

'ముదనష్టపోడు! యక్కడో తప్పతాగేసి పడిపోయుంటాడత్తా! పొద్దున్నే వత్తాడ్లే నువ్ నిద్రో!" అన్నాను.

నా మాట ఇనకుండా బయటికెళ్ళింది నిన్ను ఎతుకులాట్టాకి. నిన్ను ఎవడన్న కొట్టాడో తెల్దు లారీయో ఆటోనో గుద్దీసిందో తెల్దు! కంగారడిపోయింది మీయమ్మ"

"ముసల్ది బయటికొత్తే నువ్వెవడితో కులుకుతున్నావే నెంజ!" రాధమ్మ మెడ వంచి వీపు మీద బాదాడు సత్తిబాబు.

పోలీసులు జనాన్ని తొలిగించే పనిలో నిమగ్నమై ఉన్నారు.

''నీ కూతుర్ని ఎవడు సూస్కుంటాడ్రా గుడిసేట్నాయాలా! పిల్లనిడిసి ఎలా గెల్లమంటావ్? ఆళ్ళు మీయమ్మని ఇంటిదాకా మోసుకొచ్చేకాడికి కొనూపిరితో నుంది. అటోక్కాడా డబ్బుల్లేకుండా మెుత్తం తాగటా కట్టుకెళ్ళావ్! నానా తిప్పలు పడి తీస్కెల్లేక ఆడ సచ్చిపోయిందిరా యదవ! మీ అమ్మని నువ్వే పొట్టనెట్టుకున్నావురా! మాయదారి సచ్చినోడ దూ! నీ నోట్లో మట్టి గొట్ట!"

"అంతా నీ వల్లే రా తుప్పాసెదవ!" రాధమ్మ కట్టలు తెంచుకున్న కోపంతో అరిచింది.

సత్తిబాబు అవాక్కయ్యాడు! ఓ పోలీసు సత్తిబాబుని పక్కకు పిలిచి....

"మీ అమ్మని కొంమంది గ్యాంగ్ రేప్ చేశారయ్య!"

"ఏంటండీ?" అర్థం కానట్టు అడిగాడు సత్తిబాబు.

"అదేనయ్యా! కొంతమంది పాడు చేశారు!"

"అయ్యో! ఏటి సేసావ్రా దేవుడా!" సత్తిబాబుకి నమ్మశక్యం కావట్లేదు. తల్లి మరణానికి ఇంత దౌర్భాగ్యమైన కారణాన్ని ఒప్పుకోలేకపోతున్నాడు. వెంటనే పోలీసు దగ్గరికి పరుగెత్తాడు.

"అయ్యా! నాకేటీ బుర్రకెక్కు

తాలేదండయ్యా! మా అమ్మకి డెబ్భై నాలుగేళ్లయ్యా! ముసల్దాన్ని ఎవడు పాడు సేత్తాడయ్యా? రెండు సేతులు కలిత్తేనే కదయ్యా తేప్పట్లు? ఇంకేదో జరిగుంటదయ్యా!"

శరీరమంతా తెల్లని గుడ్డతో చుట్టేసి మొహం మాత్రమే కనిపిస్తున్న తల్లిని చూసి రోదిస్తూ అడిగాడు సత్తిబాబు.

"నీ బాధ నేను అర్థం చేస్కోగలను బాబు! మీ అమ్మకి అన్ని పరీక్షలు చేసాం. మొత్తం ఐదుగురి పళ్ళగాట్లు, గోటిగాట్లు, పాడు చేశారని ఆధారాలూ ఉన్నట్లు రిపోర్ట్ వచ్చింది. ఆమె ఎదురు తిరగడంతో వాళ్ళు బాగా కొట్టారు. మీ అమ్మ మర్మాంగం బాగా దెబ్బతింది చాలా రక్తం పోయింది. బ్రతికే ఉంటే కనీసం పద్దెనిమిది కుట్లు పడేవి. ఈ వయసులో ఆమెకంత కష్టం ఇవ్వకుండా దేవుడు మేలే చేశాడు. ఆమె వాళ్ళకంటే ముందు నిన్ను చూసినా బాగుండేది! ఎవరు చేశారో తెలీదు! చూసిన వాళ్ళు లేరు! బాధితురాలు చనిపోయింది. నీకెవరి మీదైనా అనుమానం ఉంటే చెప్పు. ఇంటి గుమ్మం నుంచే "ఒరేయ్ సత్తీ"... అని పిలుచుకుంటూ నిన్ను వెతకడం మొదలు పెట్టిందనీ నీ భార్య చెప్తుంది."

సత్తిబాబుకి అంతా చీకటైనట్టుంది. ఏమీ వినిపించట్లేదు.

"ఒరేయ్ సత్తి.... నేన్రా మీ అమ్మని!"

"నువ్వు ఎవడికి అమ్మవైతే నాకేటే!?"

ఇవే మాటలు మారు మోగుతున్నాయి అతడి చెవుల్లో, ఒక్కసారిగా కళ్ళు తిరిగాయి సత్తికి.

"నేన్రా అమ్మని! ఇంటికెల్దాం పదరా!" గుర్తొస్తున్న మాటలు....

సత్తిబాబు రక్త కన్నీరు కారుస్తున్నాడు!

◆◆◆

శవాన్ని స్మశానానికి తరలించి, కట్టెలు, పిడకలపై పడుకోబెట్టారు. సత్తిబాబు చేయాల్సిన కార్యాలన్నీ చేస్తున్నాడు. అతడి మొహం నెత్తురు చుక్కలేకుండా ఉంది. కన్నీరు లేదు! కదలిక లేదు! కర్రతో చితికి నిప్పంటించాడు....భగ్గున మండుకుంది. తన తల్లి కాలిపోతోంది. చుట్టుపక్కల ఏడుపులు, పెడబొబ్బలు వినిపించడం లేదు. అందరూ తిరుగు ప్రయాణం పట్టారు. తన కూతుర్ని, భార్యని చూశాడు. ధారాళంగా ఏడుస్తున్నారు. స్మశానంలో పని వాళ్ళు చితికి ఆజ్యం పోస్తున్నారు. మంటలు ఉవ్వెత్తున ఎగిసి పడుతున్నాయి. సత్తి తన చేతిలో ఉన్న కర్రను కింద పడేసి ఒక్క ఉదుటున తల్లి చితిలోకి దూకేశాడు!

నల్లని పొగలోంచి సత్తిబాబు ప్రాణం పైకి లేచింది....

**"ఒరేయ్ సత్తి.... నేన్రా మీ అమ్మని!"**

**"నువ్వు ఎవడికి అమ్మవైతే నాకేటే!?"**

**ఇవే మాటలు మారు మోగుతున్నాయి అతడి చెవుల్లో, ఒక్కసారిగా కళ్ళు తిరిగాయి సత్తికి.**

**"నేన్రా అమ్మని! ఇంటికెల్దాం పదరా!" గుర్తొస్తున్న మాటలు....**

చితి మీద సైతం ఘోర అవమానంతో తల్లి ఆత్మ విలపిస్తోంది!!

తల్లి చితిలో కాలుతున్న సత్తిబాబు సిగ్గుతో చావలేక, మంచి మనిషిగా మారిపోలేక తన చావులో అత్యాచారం లాంటి నరకాన్ని చూశాడు!

తల్లి శవంతో శవమై మంటల్లో బూడిదై ఆహుతయ్యాడు.

◆◆◆

"సుజీ ఇవ్వాళ్ళ పేపర్ చూశావా? తల్లి మరణం భరించలేక ఆమె చితిలోనే బూడిదైన కొడుకు! అనంతప్రేమకు నిదర్శనం! నిన్న వెళ్ళాను కదా... అదే కేసు!పాపం! మేం చూస్తుండగానే దూకేశాడు! మంటలు ఎగిసి పడటంతో కాపాడలేకపోయాం! వాళ్ళమ్మంటే పిచ్చి ప్రేమ అతనికి. నిన్న చూడాల్సింది అతని బాధ! మాటల్లో చెప్పలేను!" కళ్ళు తుడుచుకుంటూ రోజు ప్రారంభించాడు పోలీసు ఆఫీసర్. ◆

# గర్భధారణ పూర్వ మరియు గర్భస్థ పిండప్రక్రియ (లింగ ఎంపిక నిషేధ) చట్టం 1994

## The Pre-Conception and Pre-Natal Diagrnostic Techniques (prohibition of selection) Act 1994

- ఆర్. దుర్గా ప్రసన్న, అడ్వకేట్

మన రాజ్యాంగం ప్రకారం స్త్రీలు పురుషులు సమానం, లింగ వివక్ష ఉండకూడదు. అన్ని నొక్కి చెప్తున్నారు. కానీ పురుష ఆధిపత్యంతో నిండిన మన సమాజం స్త్రీని రెండవ స్థానంలోకి నెట్టివేస్తుంది. ఈ దేశంలో స్త్రీలు అన్ని వర్గాలలోనూ అన్ని స్థానాలలోనూ వివక్షకి గురిఅవుతూనే ఉన్నారు. దేశ జనాభాలో సగం కంటే ఎక్కువ ఉండే స్త్రీల జనాభా నేడు సగం కంటే తక్కువయ్యారు. అంతేకాదు జనాభా లెక్కల ప్రకారం పురుష జనాభా కంటే స్త్రీ జనాభా రోజు రోజుకీ తగ్గిపోతూంది అనే ఆందోళన కలిగించే విషయమైంది. స్త్రీలపట్ల మగవారిలో ఉండే చులకన భావం వల్ల వారిని శారీరకంగా, మానసికంగా అవహేళనలకు గురి చేయడం, వరకట్న దహనాలు, మానభంగాలేకాక వైద్యపరమైన నిరాదరణ కూడా స్త్రీల జనాభా తగ్గడానికి దోహదం చేస్తున్నాయి. స్త్రీలకు సమాజంలో సరియైన గుర్తింపు స్థానమివ్వడానికి ప్రభుత్వం స్త్రీల కొరకు కొన్ని చట్టాలనూ చేసింది.



పూర్వకాలంలో తల్లి గర్భంలో పెరిగేది ఆడశిశువో, మగ శిశువో తెలుసుకునే పరిస్థితి లేదు. ప్రసవానంతరమే తెలిసేది. కానీ వైద్య రంగ అభివృద్ధి చెందినందున శాస్త్రీయ ప్రగతి వలన గర్భస్థ పిండం యొక్క ఆరోగ్య స్థితిని పరీక్షించేందుకు అనేక కొత్త కొత్త పద్ధతులు అందుబాటులోకి వచ్చాయి. అందువల్ల గర్భస్థ పిండం యొక్క జన్యుపరమైన అవకతవకలను, అనారోగ్యాలనూ గుర్తించ వీలయ్యే అనేకానేక ప్రక్రియలు అతి సులభంగా అందుబాటులో ఉన్నాయి. కానీ మానవ కళ్యాణానికి ఉపయోగపడవలసిన ఈ మేధస్సు గర్భంలో ఉండే ఆడశిశువుల పాలిట శాపమైంది. పురుషాధిక్య భావజాలం కలిగిన ఈ దేశంలో ఆడపిల్ల మనుగడ కష్టమనుకుంటున్న తల్లులు, ఆడపిల్ల వద్దనుకుంటున్న తండ్రులు ఇతర బంధువులు తల్లి గర్భంలో పెరిగే పిండం యొక్క ఆరోగ్య స్థితిగతులను తెలుసుకునే స్కానింగు ఇతర పరీక్ష విధానాల్లో ఆ పిండం ఆడపిల్ల అని తేలగానే ఆ గర్భ విచ్ఛిత్తికి పాల్పడడం అతి క్రూరము, హేయము. ఇది ఈ దేశంలో మహిళలపట్ల, ఆడపిల్లలపట్ల చూపుతున్న వక్షపాత వైఖరికి, నిరాదరణకూ ఒక మచ్చుగా నిలిచిందీ సంస్కృతి. ఈ విష సంస్కృతికి వైద్య బృందమూ ముఖ్య కారకులు అవుతున్నారు. కేవలం ధనాపేక్షతో ఎక్కడికక్కడ స్కానింగు సెంటర్లను నడిపించి గర్భస్థ శిశువు ఆడపిల్లో, మగపిల్లాడో నిర్ధారించి, ఆడపిల్ల అయితే అబార్షన్లకు సహకరించి అబార్షను (గర్భ విచ్ఛిత్తి) చేసి మరీ డబ్బులు సంపాదిస్తున్నారు.

వైద్య శాస్త్రము, వైద్యులు మనుష్యుల అభివృద్ధికి, అభ్యున్నతికి ఉపయోగకరంగా ఉండాలి కానీ, ఆడపిల్ల పుడితే నేరమని, దురదృష్టకరమనే భావనను సమాజంలో పెంచే విధంగా ఉండకూడదు. వైద్య శాస్త్రాన్ని అడ్డంపెట్టుకుని తల్లి గర్భంలో ఉండగానే ఆడశిశువులను అంతం చేసే ఈ విష సంస్కృతికి అడ్డుకట్ట వేసే ప్రయత్నమే ఈ పి.సి.పి.ఎన్.డి.టి. చట్టం. అంటే The Pre-Conception and Pre-Natal

Diagrnostic Techniques (prohibition of selection) Act 1994 చట్టం ప్రకారం గర్భంలో ఉన్న శిశువు ఆడపిల్ల అని గానీ, మగ పిల్లవాడు అనిగానీ వైద్య పరీక్షల ద్వారా నిర్ధారించి చెప్పడం నేరం. అందుబాటులో ఉన్న వైద్య పరీక్షల ద్వారా మాతా శిశువుల యొక్క ఆరోగ్య పరిస్థితులను విశ్లేషించాలి తప్ప గర్భస్థ శిశువు ఆడపిల్ల అయితే గర్భ విచ్చిత్తిని ప్రోత్సహించరాదు. అలా చేసినట్లైతే వారు చట్టం ప్రకారం శిక్షార్హులు.

ఈ చట్టం ఫిబ్రవరి 1వ తేదీ 1996 నుండి జమ్ము కాశ్మీర్ రాష్ట్రాలు తప్ప మిగిలిన భారతదేశమంతటా అమలులోనికి వచ్చింది. ఈ పిఎన్‌డిటి చట్టం క్రింద కొన్ని కేసులు దాఖలు అయిన తరువాత ఈ చట్టంలో అవసరమైన కొన్ని సవరణలనుసుప్రీం కోర్టు సూచించడం జరిగింది. ఫలితంగా ఈ పిఎన్‌డిటి యాక్ట్ మరిన్ని అవసరమైన సవరణలతో 2003సం॥లో మన ముందుకు వచ్చింది. గర్భస్త పిండ దశలోనే లింగ నిర్ధారణ చేసి/గుర్తించి ఆడపిల్ల అనే ఒకే ఒక కారణంగా అబార్షన్లను నిరోధించడమే ఈ చట్టం యొక్క ముఖ్య ఉద్దేశ్యం.

అబార్షన్లు నేరానికి పాల్పడిన వైద్యులను, వైద్య పరీక్షలు జరిపి సహకరించిన ఇతర సిబ్బందికి మూడు సంవత్సరాలుజైలు శిక్ష, పదివేల రూపాయలు జరిమానా విధించబడతాయి. అంతేకాదు ఇదే నేరానికి మళ్ళీ మళ్ళీ పాల్పడితే ఐదు సంవత్సరాలు కారాగార శిక్ష, 50వేల రూపాయలు జరిమానా విధించబడతాయి. వైద్యవృత్తిలో ఉన్నవారు జైలు శిక్షను అనుభవించినట్లైతే వారి గుర్తింపును 2సం॥ల వరకూ రద్దు చేయడం జరుగుతుంది. పుట్టబోయే పిల్ల ఆడపిల్లా? మగపిల్లాడో లింగ నిర్ధారణ చేయడం ఎంత నేరమో అటువంటి పరీక్షలు జరిపించుకునే తల్లిదండ్రులు వారి బంధువులు కూడా నేరస్థులు అవుతారు. శిక్షార్హులు అవుతారు. తల్లికి అబార్షను ఇష్టంలేకపోయినా ఇతర కుటుంబ సభ్యులు ఆడపిల్ల అని తెలిసి అబార్షనుకు ప్రోత్సహించినా సహకరించినా వారు కూడా తీవ్ర నేరస్థులుగా ఈ చట్టం పరిగణిస్తుంది.

## ఇక చట్టంలోని కొన్ని ముఖ్యాంశాలు:

1. సెక్షన్3 ప్రకారం జన్యు సంబంధ పరీక్షలు నిర్వహించే వ్యక్తులు గానీ, ప్రభుత్వ ప్రయివేటు సంస్థలు గానీ వైద్యులు గానీ జిల్లా వైద్య మరియు ఆరోగ్య శాఖాధికారి వద్దనిర్దేశించబడిన రుసుమును చెల్లించి ఈ చట్టం క్రింద రిజిస్ట్రేషను చేసుకోవాలి. అంతేకాదు వారితో పనిచేసే ఇతర సిబ్బంది వివరాలు, జీత భత్యాలు, గౌరవ వేతనాలతోబాటు వారివారి విద్యార్హతలను కూడా నమోదు చేయాలి. ఈ చట్టపరిధిలో అన్ని అల్ట్రాసౌండ్ స్కానింగ్ యంత్ర పరికరాల వివరాలు, వాటి సామర్థ్యం వాటిని ఎక్కడ ఏర్పాటు చేస్తున్నారు వాటి పూర్తి వివరాలు కూడా జిల్లా వైద్య అధికారి ముందు రాతపూర్వకంగా వెల్లడించాలి.

సెక్షన్3బి ప్రకారం ఆయంత్రాల యొక్క ఉత్పత్తిదారులు, పంపిణీదారులు, అమ్మకపుదారులు ప్రభుత్వం అనుమతించిన వారికే విక్రయించాలి, పంపిణీ చేయాలి. ఒకసారి రిజిస్ట్రేషన్ చేయించుకున్నవారికి 5సం॥ల తరువాత మళ్ళీ రెన్యువల్ చేస్తారు.

సెక్షన్ 4 ప్రకారం గర్భవతులను గానీ పిండం ఎదుగుదలలో కానీ అసాధారణ పరిస్థితులు ఉన్నపుడు మాత్రమే ఈ పరీక్షలను నిర్వహించాల్సి ఉంటుందని ఈ చట్టం స్పష్టంగా పేర్కొంది. అంతేకాదు ఆయా పరీక్షలకు సంబంధించిన పూర్తి వివరాలను, నిర్వహించిన తీరూ, ఇతర వివరాలనూ కూడానమోదు చేయాలి. అంతేకానీ గర్భిణీ స్త్రీయొక్క బంధువులు కానీ భర్త గానీ, స్వయంగా ఆమె కానీ కోరుకున్నందున ఈ పరీక్షలను నిర్వహించరాదు. ప్రోత్సహించరాదు.

సెక్షన్6 ప్రకారం లింగ నిర్ధారణ వివరాలు ఎటువంటి పరిస్థితులలోనూ వివరించరాదు. ఈ సంస్థలు లింగ నిర్ధారణ జరుపబోమనే విషయం స్పష్టంగా తెలియజేస్తూ 2,3 కంటే ఎక్కువ సైన్ బోర్డులను ప్రదర్శించాలి. అవి అక్కడికి వచ్చిన వారికి స్పష్టంగా అర్థం అయ్యేలా వుండాలి.

సెక్షన్ 22,23 ప్రకారం చట్టాన్ని అతిక్రమించిన వారికి కఠిన శిక్షలు తప్పవు.

గర్భంలో ఉన్న ఆడశిశువును బ్రతికించడానికి చట్టం చేయవలసిన పరిస్థితులు అతి దురదృష్టకరమే అయినా సమాజంలోని స్త్రీ పురుషులు అసమానతలను నియంత్రించడానికి, సామాజికంగా స్త్రీలలోని ఆత్మ న్యూనతను పోగొట్టడానికి, ఆడపిల్లను స్వాగతించే ఆరోగ్యకరమైన సమాజానికి ఈ చట్టం చాలా అవసరం. ◆

కేస్ స్టడీ

# అతకని మనసులు

- శారద

"నా తప్పేమిటో చెప్పండి? ఎన్నోసార్లు చెప్పకుండా ఇంట్లో నుండి వెళ్ళిపోయాడు. అయినా ఎంతో ధైర్యంగా పిల్లల్ని పెంచుకుంటున్నాను. అమ్మ, తమ్ముడు ఇన్నాళ్ళు నాకు అండగా ఉన్నారు. వాళ్ళెందుకు రాకూడదు? భరించేవాడే భర్తంటారుకదా! హరి నన్ను ఎన్నడైనా బాధ్యతగా చూసుకున్నాడా? నెలల తరబడి, సంవత్సరాల తరబడి వదిలి వెళ్ళి ఫోనైనా చేయకుండా ఎక్కడికి వెళ్ళాడో తెలియకుండా ఇబ్బంది పెట్టిన వాడికి షరతులు పెట్టే అధికారం ఎలా వచ్చింది? నన్ను నన్నుగా తీసికెడితేనే వస్తాను. లేకపోతే వెళ్ళను.

టైం 9 గంటలైంది. 10 నిముషాలలో ఆఫీస్‌లో వుండాలి. స్నానం చేసి తయారై లంచ్ బాక్స్ సర్దుతుంటే శ్యామల వచ్చింది. 'రాధా ఇంకా రెడీ అవలేదా?' అంది. 'ఇదిగో వస్తున్నా'అంటూ ఇంటికి తాళం వేసి బయలుదేరింది శ్యామల. దారిలో 'రాధా! పాప పెళ్ళి విషయం ఏమాలోచించావు?' అని అడిగింది శ్యామల.

మళ్ళీ శ్యామలే అడిగింది. 'రాధా ఎలాగూ నువ్వు నేను స్నేహితురాళ్ళం. ఇద్దరం ఒంటరిగా కుటుంబ బాధ్యతలు చూసుకుంటున్నాము. మా అబ్బాయి హరి, మీ పాప అనితలకు పెళ్లి చేస్తే బావుంటుంది. వాళ్ళిద్దరి జంట చూడ ముచ్చటగా ఉంటుంది. పిల్లలిద్దరూ మన కళ్లముందే ఉంటారు కదా! ఏమంటావు?' అనడిగింది. ఈలోగా ఆఫీస్ వచ్చి ఇద్దరు ఎవరి సెక్షన్ వైపు వారు వెళ్ళారు.

ఆ రాత్రి ఆలోచిస్తుంటే శ్యామల చెప్పింది బాగానే ఉందనిపించింది. మర్నాడు కొడుకుతో విషయాన్ని చెప్పింది రాధ. అంతే నెల తిరగకుండానే మంచి ముహూర్తములో వారిద్దరికి వివాహం చేశారు. ఉన్నంతలోనే అన్నీ అమర్చి సంసారం ఏర్పాటు చేశారు. పిల్లల సంసారాన్ని చూసి స్నేహితురాళ్ళిద్దరూ హాయిగా ఆనందంగా గడపసాగారు.

ఏడాది తిరిగేసరికి ఒక పాప తల్లంది అనిత. హరి, అనిత, పాపలతో ఊడిపడ్డాడు హరి. తెనాలిలో హొటల్ పెట్టానని అనితను పిల్లల్ని తీసుకుని వెళ్ళాడు. 6 నెలలు బాగానే ఉన్నారు. మళ్ళీ అదీ మానేసి ఎటో వెళ్ళిపోయాడు. ఫోన్ కూడా చేయలేదు. చేసేది లేక అనిత అమ్మ దగ్గరకే వచ్చింది మళ్ళీ.

ఒకరోజు అనిత పేరుమీద రిజిస్టర్ పోస్టు వచ్చింది. చూస్తే మోటూరు ఉదయం న్యాయసలహా కేంద్రం నుండి. తన అల్లుడు తన భార్య పిల్లలను తన దగ్గరకు పంపించడం లేదని వాళ్ళ వద్ద కంప్లైంట్ చేశాడు. పై వారం అనితను వచ్చి మాట్లాడమని ఉంది. అనిత తల్లిని తీసుకుని న్యాయ సలహా కేంద్రంకు వెళ్ళి కలిసింది. అనితతో మాట్లాడాక హరి చంచలత్వం అర్థమయింది అక్కడి వాళ్ళకు. ఇద్దరికి రెండు వారాలపాటు కౌన్సిలింగ్ చేశారు.

సంతోషంగా కాలం గడిచిపోతోంది. అంతా అలాగే జరిగిపోతే ఇంక కథేముంటుంది? సడన్‌గా హరి ఉద్యోగం మానివేశాడు. వేరేది చూసుకుంటా నన్నాడు. ప్రాణ స్నేహితురాలు శ్యామల అకాల మృత్యువు పాలైంది. పాపని, 4 నెలల గర్భవతి అనితను తన దగ్గర వదిలి వెళ్ళిన హరి 6 నెలలైనా జాడలేదు. అనితకు మరో పాప కలిగింది.

ఒక రోజు ఉన్న వళంగా రోజులు నెలలై ఏళ్లయినాయి. హరి జాడ లేదు. పిల్లలిద్దరూ స్కూలుకెళు తున్నారు. ఇంతలో ఒకనాడు మళ్లీ హరి వచ్చాడు. తాడేపల్లిలో హొటల్ పెట్టానని చాలా బాగా నడుస్తుందని చెప్పాడు. మళ్ళీ తరుచు వచ్చి వెడుతున్నాడు. పిల్లలు నెమ్మదిగా తండ్రి దగ్గర అలవాటు పడుతున్నారు. తాడేపల్లిలో కాపురం పెడతానన్నాడు.

రాధ ఆఫీస్‌లో లోన్ తీసుకొని

తాడేపల్లిలో చిన్న ఇల్లు కొన్నది చాలా రోజుల క్రితం. దానిలో ఒక గది తనకు ఉంచుకొని మిగతా ఇంట్లో కూతురు, అల్లుడు పిల్లలకు అన్ని సౌకర్యాలు, వస్తువులు, ఇంటికి కావలసిన సామాన్లు అమర్చి మళ్ళీ కాపురం పెట్టిచ్చింది. బాగానే ఉన్నారు. ఆడపాదడపా తను బాబు వెళ్లి చూసి వస్తున్నారు. ఏడాది గడిచింది. మళ్లీ హరి పరారైనాడు. చూసి చూసి విసుగొచ్చి అనితను తీసుకొచ్చేశారు. కాలం గడుస్తోంది. పిల్లలిద్దరూ 7, 5వ తరగతులు చదువు తున్నారు.వారానికొకసారి చర్చికి వెళ్ళడం అలవాటయింది అనితకు. ఇలా రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజు అనిత పేరుమీద రిజిస్టర్ పోస్టు వచ్చింది. చూస్తే మోటూరు ఉదయం న్యాయసలహా కేంద్రం నుండి. తన అల్లుడు తన భార్య పిల్లలను తన దగ్గరకు పంపించడం లేదని వాళ్ళ వద్ద కంప్లైంట్ చేశాడు. పై వారం అనితను వచ్చి మాట్లాడమని ఉంది. అనిత తల్లిని తీసుకుని న్యాయ సలహా కేంద్రంకు వెళ్ళి కలిసింది. అనితతో మాట్లాడాక హరి చంచలత్వం అర్థమయింది అక్కడి వాళ్ళకు. ఇద్దరికి రెండు వారాలపాటు కౌన్సిలింగ్ చేశారు. చివరకు అనితకూడా హరితో వెళ్ళడానికి ఒప్పుకుంది. హరి కూడా భార్యను బాగా చూసుకుంటానని ఎక్కడికీ వెళ్ళనని చెప్పాడు. కానీ ఒక షరతు పెట్టాడు. తన భార్య చర్చికి వెళ్ళరాదని, బైబిల్ చదువరాదని ఇంట్లోనుంచి బయటకు రావడానికి కుదరదని, తనకి హొటల్లో సాయపడాలని, పని చేయాలని, తన పుట్టింటి వారెవరూ రావడానికి వీలులేదని చెప్పాడు.

**"నా తప్పేమిటో చెప్పండి? ఎన్నోసార్లు చెప్పకుండా ఇంట్లో నుండి వెళ్ళిపోయాడు. అయినా ఎంతో ధైర్యంగా పిల్లల్ని పెంచుకుంటున్నాను. అమ్మ, తమ్ముడు ఇన్నాళ్ళు నాకు అండగా ఉన్నారు. వాళ్ళెందుకు రాకూడదు? భరించేవాడే భర్తంటారుకదా! హరి నన్ను ఎన్నడైనా బాధ్యతగా చూసుకున్నాడా? నెలల తరబడి, సంవత్సరాల తరబడి వదిలి వెళ్ళి ఫోనైనా చేయకుండా ఎక్కడికి వెళ్ళాడో తెలియకుండా ఇబ్బంది పెట్టిన వాడికి షరతులు పెట్టే అధికారం ఎలా వచ్చింది? నన్ను నన్నుగా తీసికెడితేనే వస్తాను. లేకపోతే వెళ్ళను.**

అంతే అనిత కోపంతో మండిపడింది. "నా తప్పేమిటో చెప్పండి? ఎన్నోసార్లు చెప్పకుండా ఇంట్లో నుండి వెళ్ళిపోయాడు. అయినా ఎంతో ధైర్యంగా పిల్లల్ని పెంచుకుంటున్నాను. అమ్మ, తమ్ముడు ఇన్నాళ్ళు నాకు అండగా ఉన్నారు. వాళ్ళెందుకు రాకూడదు? భరించేవాడే భర్తంటారుకదా! హరి నన్ను ఎన్నడైనా బాధ్యతగా చూసుకున్నాడా? నెలల తరబడి, సంవత్సరాల తరబడి వదిలి వెళ్ళి ఫోనైనా చేయకుండా ఎక్కడికి వెళ్ళాడో తెలియకుండా ఇబ్బంది పెట్టిన వాడికి షరతులు పెట్టే అధికారం ఎలా వచ్చింది? నన్ను నన్నుగా తీసికెడితేనే వస్తాను. లేకపోతే వెళ్ళను. చర్చి అయినా, గుడి అయినా, మసీదు అయినా దైవ ప్రార్థనకే కదా వెళ్ళేది? దానిలో తప్పేముంది? మతాలన్నీ, కులాలన్నీ ఒకటే మత సామరస్యం కూడా ఒకటే. దైవం అంతా ఒకటే అని, ఎవరినైనా ఆరాధించవచ్చు. దీనికి షరతులెందుకు విధించాలి? నా తల్లి ఇచ్చిన ఇంట్లో నా పిల్లలతో నేను ఉంటున్నాను. ఇష్టమైతే తననే నావద్దకు రమ్మనండి" అంది.

మళ్ళీ వచ్చే వారం వచ్చిన హరికి అదే వివరించి చెప్పారు న్యాయ సలహా కేంద్రంలో బాధ్యులు. ఎన్ని చెప్పినా అతను ఒకటే మాట చర్చికి వెళ్ళవద్దని. అత్త, బావమరిది కలగచేసుకోకూడదని వాదించాడు, ఎంతగానో నచ్చచెప్పారు. అయినా వినలేదు.

"నాకు నా పిల్లలు చాలు. నా చదువుకు తగిన ఉద్యోగం చూసుకుంటాను. నేను నాభర్తకు విడాకులిచ్చేస్తాను" అంది. జీవితంలో ఎవరూ ఎవరికీ చివర వరకు తోడు రారు. అమ్మయినా, భర్తయినా, తండ్రయినా, తమ్ముడయినా కొంత వరకు మాత్రమే చేయి అందిస్తారు. భర్తతోడులేకపోతే బతకలేని దానిని కాదు. నా పిల్లలకి తల్లిని, తండ్రిని నేనే అయి పెంచుకుంటాను" అన్న అనిత నిర్ణయాన్ని న్యాయసలహా కేంద్రం బాధ్యులు కూడా ఆమోదించారు.

కులాలు, మతాలు అని పట్టుదల పడితే ఏమీ సాధించలేము. ఒక రకంగా అనిత ధైర్యాన్ని మెచ్చుకోవాలి. నేను బతికున్నంతకాలం నా కూతురుకి తోడు ఉంటానని భరోసా ఇచ్చిన రాధను ప్రశంసించారు న్యాయ సలహా కేంద్రం వారు. ◆

మీడియా

# హృదయపుటంచులు దాటిన "కంచె"

- కె. సమత

కంచె సినిమా ఒక షేక్స్పియర్ నాటకంలా, ఒక శ్రీశ్రీ రచనలా సామాజికపరంగా మనలో భావోద్వేగాన్ని మేల్కొల్పుతుంది. ఒక్కొక్క డైలాగ్ సూటిగా, లోతైన ఆలోచనల్తో తూటాల్లాగా ప్రేక్షకుల్లోకి దూసుకెళ్తుంది. ఒక రెండు గంటల సినిమాలో కంచెను కులాల మధ్య నుండి, మత కల్లోలాల నుండి, సైనిక దళాల నుండి, దేశాల మధ్య యుద్ధాల నుండి, స్త్రీల అణచివేత వరకూ అన్ని కోణాల్లో చూపించి 'కంచె పీకండిరా!' అంటూ గళం ఎత్తిన ఒక కళాత్మకమైన రూపం కంచె. క్రిష్ సినిమా అనగానే సామాజిక కోణంలో అద్భుతంగా డైరెక్ట్ చేస్తారనే ప్రత్యేకత ఉంది. కానీ ఈ సినిమా అంచనాలకి మించిపోయింది. సినిమా చూసిన వెంటనే 'హేట్సాఫ్ క్రిష్' అనాల్సిందే. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న సమయంలో ఇటలీలో జర్మన్ ఫాసిస్టల నియంతృత్వాన్ని ఒక పక్క, భారత దేశంలో కులం నియంతృత్వం మరో పక్క చూపిస్తూ బాలెన్స్‌డ్‌గా చిత్రీకరించింది ఈ సినిమా.

అది 1939 సెప్టెంబరు1. (రెండవ ప్రపంచ యుద్ధం) యుద్ధం పంజా విసిరిన రోజు. నాగరికత రక్త మాంసాలకు అలవాటు పడ్డ నాజీ నియంత అడాల్ఫ్ హిట్లర్ అరాచకత్వం, జనాల శవాలపై కవాతు చేసే ముస్సోలిని నిరంకుశత్వం, జపాన్ చక్రవర్తి హిరోహితో సైనిక వాదం ప్రపంచ పటం మీద నెత్తుటి చారికలు గీస్తున్నాయ్. ఇవి చరిత్ర పుటల్లో చెరగని మరకలుగా మిగులుతున్నాయ్. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసే సరికి భూగోళం అస్తి పంజరం అయ్యింది. ముస్సోలిని శకం అంతరించిపోయింది. మిత్ర దేశం అయిన ఇటలీకి మద్దతుగా రాయల్ ఇండియన్ ఆర్మీ నుండి 75,000 మంది యోధులు బ్రిటిష్ దళాలతో కలిసి ఇటాలియన్ క్యాంప్‌లో పోరాడుతున్నారు. ఈ పోరాడుతున్న సైనికుల్లో హరి, ఈశ్వర్ అనే ఇద్దరు ఒకే ఊరికి చెందిన స్థాయి బేధాలు కలిగిన సైనికులు.

వీరిద్దరి మధ్యా జరిగిన గతం ఒక గ్రామంలో కుల వ్యవస్థ వల్ల జరిగిన కల్లోలాన్ని చిత్రిస్తుంది. హరి, సీత చెన్నపట్నంలో చదువుకుంటున్న విద్యార్థులు. ఇద్దరిదీ ఒకే వూరు. సీతది రాజుల కుటుంబం, హరిది క్షురకుల కుటుంబం. కులంతో సంబంధం లేకుండా ఇద్దరూ ప్రేమించుకుంటారు. సారలమ్మ పండుగకి ఇద్దరూ కలిసి ఊరికి ప్రయాణం అవుతారు. ఊర్లో కులాల మధ్య ఉన్న కంచెలు వారి ప్రేమను తిరస్కరిస్తాయి. సీతకు అన్న ఈశ్వర్. తన ప్రేమ వ్యవహారం తెలిసి కుటుంబ పరువు గురించి సీతకు, ఈశ్వర్‌కు జరిగే సంభాషణ స్త్రీలపై సమాజం పెట్టే ఆంక్షల్ని గుర్తు చేస్తాయి. సీత చెప్పే సమాధానాలు ఒక స్వతంత్ర భావాలు కలిగిన స్త్రీమూర్తిని మన ముందు సాక్షాత్కరింపచేస్తాయి. అవసరాల శ్రీనివాస్ పాత్ర భిన్నమైనది. సందర్భానుసారంగా మా శ్రీనివాస్ అప్పుడే చెప్పాడు అంటూ.. శ్రీశ్రీ మాటల్ని గుర్తు చేస్తూ, ప్రతి సీన్‌లోనూ భారీ భావజాలాన్ని చేర్చి ఒక సెన్సిటివ్ ఫీల్‌ని ఇస్తుంది. వరుణ్ తేజ్ పాత్ర ఒక రచయిత పాత్ర కూడా వహిస్తుంది. జర్మనీలో హిట్లర్ ఊచకోతను తన గ్రామంలో కుల వ్యవస్థ అణచివేతను




ఒక క్రమంలో వర్ణిస్తూ "ఏ దేశ చరిత్రను చూసినా ఏమున్నది గర్వకారణం, నర జాతి చరిత్ర సమస్తం పర పీడన పరాయణత్వం" అంటూ శ్రీశ్రీ మాటల్ని మరొక్కసారి గుర్తు చేస్తుంది కంచె.

కంచె గురించి ఎంత చెప్పినా ఏదో మిస్ అవుతున్నట్లు ఉంది. ఎందుకంటే ఈ సినిమా డైలాగ్‌లు సోషల్ మీడియాలో హల్‌చల్ చేస్తున్నాయి. ఒక ప్రత్యేక గుర్తింపును సంతరించుకున్నాయి. వాటిల్లో నాకు బాగా నచ్చిన డైలాగ్‌లు కొన్ని చెబుతాను.

"కులం అంటే పని. కమతాన్ని నమ్ముకున్నోడు కమ్మోడు అయ్యాడు. కాపు కాసేవాడు కాపోడయ్యాడు, కుమ్మరి వాడి కుండ, చాకలి బండ, కంసాలి సాత, సాలీల నేత వాళ్ళు మాత్రమే బ్రతకడానికి కాదు, అలా అడిగిన వాడు మనిషి కాడు."

"ఆడతనం ఒక్కో దేశంలో ఒక్కోలా ఉంటుందనుకున్నాను. అమ్మతనం ఏ దేశంలో అయినా ఒకేలా ఉంటుందని తెలిసింది."

"మతాలు కులాల మధ్య గొడవలెందుకు బాబు, ఏం వస్తది? ఉనికి ఊరికినే వచ్చిందేంట్రా? గొడవ చిలికి చిలికి గాలి వాన అయిందనుకో, నాలుగు తలకాయలు పగిలాయనుకో, ఆ తలకాయలు పక్కన మనం నుల్చున్నాం అనుకో, మనది పెద్ద తలకాయ అవుద్ది. పదవి అంటే ఏమనుకున్నావ్ రా? గొడవల మీద గుత్తాధిపత్యం.'

"దాక్కుని దాక్కుని చేయడానికి ఇది యుద్ధం కాదు ప్రేమ."

"మనిషికి మనిషికి మధ్య కనిపించని కంచె ఒకటుంది. దాన్ని చూసుకుని వెళ్ళాలి. తెల్ల వాళ్ళ మీదకి ఎదురు తిరగటమన్నది వారి మీద కోపంతో కాదు. దేశభక్తితో కాదు, ఉ డుకుబోత్తన్నంతో, మనల్ని మనమే ఏలుకోలేమా అని".

"కంచె దాటితే ఆ కంచెయే చంపాలి. వాళ్ళంటే వీళ్ళకి పడదు. ఊళ్ళకి పడదు. నీళ్ళకి పడదు. కులాలకి పడదు. గోత్రాలకి పడదు. భాషలకు పడదు. యాసలకు పడదు. మనుషుల్లో ఉన్న జాతి గోతిని ఒక్కసారి కదిలించామనుకో ఊరంతా తగలబెట్టేస్తుంది. రాయి రాయి రాయడమే మిగిలింది- మిగిలింది రావణ కాష్టం."

"ఇంత విశాలమైన విశ్వంలో కోట్ల కోట్ల కోటాను కోట్ల జీవాల్లో మనం ఎంత? మన పగలు, పంతాలు, పట్టింపులు? నీది-నాది, హద్దు-యుద్ధం, తోక-తోటకూర, మట్టి-మసానం ఏంటిది? ఒక్కో చుక్కలో(భూమిలో) బ్రతుకుతున్న ముక్కలం. అందరం అయిన వాళ్ళం అదే ఈ నా కొడుక్కి అర్థం కావట్లేదు."

"కన్నీరు చెబితే ఏ భాష అయినా అర్థమైపోతుంది."

"ప్రేమ యుద్ధంలో కూడా ఉంటుంది. ఎక్కడైనా ప్రేమ యుద్ధంలానే ఉంటుంది."

"స్వస్తిక్(హిట్లర్ ఫాసిజం గుర్తు) అంటే శుభం అని అర్థం. భూమికి నాలుగు దిక్కులు అందరివనీ, ఏ ఒక్కడి సొత్తూ కాదని చెబుతున్నాయి ఆ గుర్తులో గీతలు. ఆ గుర్తుకి అర్థం ఆ హిట్లర్ గాడికి తెలియక మనుషులందరినీ చంపుతున్నాడు."

"వీళ్ళంతా మన గర్భాన్ని వాడుకుని బతుకుతున్నారమ్మ..మనం కేవలం వారసుల్ని కనడం కోసమే.. అది కూడా ఒక గౌరవం అనుకుని బతికేయాలి అంతే. కానీ, ఏం చేస్తాం? మన కర్మ... మీ తరానికి కాష్టమే. అలవాటు చేసుకోవాలంతే."

"వీళ్ళు (మత, కుల కల్లోలాలు సృష్టించేవాళ్ళు) మా వాళ్ళు, మీ వాళ్ళు కాదు, మనిషి తోలు కప్పుకున్న గుంట నక్కలు."

**"కంచె పీకండిరా, అన్నం ముద్దలా ఉండాల్సిన ఊరు మెతుకులుగా విడిపోయింది. మనుషులు కలిసి బతకాలి కానీ కంచెలు వేసుకుని కాదు. కంచెలు పీకండిరా."**

డైలాగ్స్ చదువుతుంటే సినిమాలో డెప్త్ కనిపిస్తోంది కదూ.. అవునండి... సినిమా చూశాక ఒక భిన్నమైన అనుభూతితో గుండె బరువెక్కుతుంది. ఈ సినిమాలో "భగ భగమని ఎగిసిన మంటలు ఏ కాంతి కోసం" అనే పాటలో సాహిత్యం ఆస్వాదించాల్సిందే. కులాత్మకతను కళాత్మకతతో 'కంచె'ను తెరకెక్కించిన క్రిష్ బృందానికి శాల్యూట్! ◆

## ఇంట్లో కుటుంబరావు గారు:



కుటుంబరావు గురించి ప్రత్యేకంగా చెప్పేదేమీ లేదు. ఇంటా బయటా ఆయన ఒకే రకంగా ఉండేవారు. హిపోక్రసీ, అనవసరమైన మొహమాటాలూ ఉండేవి కావు. ఎవరి జోలికీ వెళ్ళేవారు కాదు -అసలు దానికి సమయమే ఉండేది కాదు. ఎవరి గురించైనా చులకనగా కాని, వెటకారంగా గాని మాట్లాడడం నేనెప్పుడూ వినలేదు. అసలు ఇంకొకళ్ళ గురించి గాసిప్ చేసే స్వభావం కాదు ఆయనిది. ముందే చెప్పినట్టు, చివరి కొన్నేళ్ళు తప్ప ఎప్పుడూ బోర్లా పడుకుని రాసుకుంటూనో, కూర్చొని ఏదైనా పుస్తకం చదువుకుంటూనో కనిపించేవారు. మా అమ్మా నాన్నలకి ఉన్న పుస్తకాలు చదవడమనే అలవాటే వారసత్వంగా మాకు కూడా వచ్చింది. A child learns by imitating elders అంటారు కదా!

ఇక నాన్నకి వంట చెయ్యడం హాబీ. రాసి రాసి అలసిపోతే వంటింట్లోకి వచ్చి ఏవైనా ఐటమ్స్ చేసేవారు. బండ పచ్చడి కూడా చేసేవారంటే ఆశ్చర్యపోతారేమో.

- ఆర్. శాంత సుందరి

వైద్యం

# స్త్రీలలో నడుము నొప్పి

- డా॥ ఎం. రమాదేవి

జీవితంలో ప్రతి ఒక్కరు ఏదో ఒక టైంలో నడుంనొప్పిని అనుభవించే వుంటారు. ఒకప్పుడు వయస్సు మళ్ళిన వారిలోనే కనిపించే నడుమునొప్పి ఇప్పుడు పిల్లల నుండి పెద్దల దాకా ఎవరికైనా వచ్చేస్తూ వుంది. ఇక మహిళలలో మరింత ఎక్కువ. దీనికి కారణం మారిన జీవన విధానమే.

**ఎందుకు వస్తుంది?**

నడుం నొప్పి రావడానికి ప్రధాన కారణం వెన్నుపూసల మధ్యన వున్న కార్టిలేజ్‌లో వచ్చేమార్పు. కార్టిలేజ్ వెన్నుపూసలు సులువుగా కదలడానికి తోడ్పడుతుంది. ఈ నొప్పి కార్టిలేజ్ క్షీణించి, ఆస్టియోఫైట్స్ ఏర్పడటం వల్ల వస్తుంది. శరీరానికి ఊతమిచ్చే కీలకమైన భాగం 33 వెన్నుపూసలు అరిగిపోవటం వల్ల కూడా నొప్పి వస్తుంది.

1. సాధారణంగా కంప్యూటర్ల ముందు ఎక్కువసేపు కదలకుండా కూర్చొని పనిచేయడం.
2. తీసుకునే ఆహారంలో కాల్షియం, విటమిన్లు లోపించడం.
3. కుర్చీలలో అసంబద్ధ భంగిమల్లో కూర్చోవడం.
4. పడక సరిగ్గా కుదరనప్పుడు.
5. ఎత్తు చెప్పులు లేదా ఎగుడు దిగుడు చెప్పులు వాడినప్పుడు తదితర కారణాల వల్ల నడుము నొప్పి సమస్య తలెత్తుతుంది.

**లక్షణాలు:**

నడుం నొప్పి తీవ్రంగా వుండి వంగడం, లేవడం, కూర్చోవటం కష్టంగా మారుతుంది. కదలికల వలన నొప్పి తీవ్రత పెరుగుతుంది. నాడులు ఒత్తిడికి గురికావడం వలన నొప్పి ఎడమకాలు లేదా కుడికాలుకు వ్యాపించి బాధిస్తుంది. హఠాత్తుగా నడుము వంచినా, బరువులు ఎత్తినా నొప్పి భరించలేనంత వుంటుంది.

**ఏమి చేయాలి?**

1. సమస్య ఎక్కువగా వుంటే కనీసం 3 వారాలు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి. మంచంమీద కాకుండా బల్లకానీ లేదా క్రింద కాని పడుకోవాలి.
2. నొప్పిగా వున్న నడుము భాగం మీద వేడి నీటి కాపడం, ఐస్ బ్యాగ్ పెట్టడం లాంటివి చేయాలి.
3. ఫిజియోథెరపీ చేయించుకోవాలి.

**జాగ్రత్తలు:** శరీరం బరువు ఎక్కువవున్నా వెన్నెముక మీద అదనపు ఒత్తిడి, భారం పడుతుంది. కాబట్టి బరువు నియంత్రణలో వుంచుకోవాలి. శారీరక శ్రమ, వ్యాయామం అలవాటు లేని వాళ్ళు బరువులు ఎత్తితే కూడా నడుము పట్టేస్తుంది. ఇలాంటి వాళ్లు హఠాత్తుగా బరువులు ఎత్తితే కండరాలు, ఎముకలను పట్టి వుంచే కండరాలు అందుకు తగినట్టుగా స్పందించవు. ఇలాంటి వాళ్ళు కాస్త పెద్ద బరువులు ఎత్తకపోవటమే మేలు. ఎత్తేటప్పుడు కూడా నడుము మీద భారం పడకుండా.... మోకాళ్ళ మీదే



ఎక్కువ భారం పడేలా కూర్చుని లేవాలి. వంగి లేవకూడదు. పౌష్టికాహారం తీసుకోవాలి. స్థూలకాయం తగ్గించుకోవాలి.

నడుం నొప్పికి చిన్న చిన్న **జాగ్రత్తలు :** సాధారణంగా స్త్రీలు ఇంటిలో చేసే కొన్ని పనుల వల్ల నడుము నొప్పి ఎక్కువవుతుంటుంది. అలా అని ఆ పనులు చేయకుండా కూడా కుదరదు. అందుకనే అటువంటి పనులు చేసేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి.

**ఇల్లు ఊడ్వడం:** నడుము వంచి ఊడ్వడం వల్ల నడుము నొప్పి వస్తుంది. ఇల్లు ఊడ్చేటప్పుడు చీపురును శరీరం ముందు భాగమున ఉండేటట్లు పట్టుకొని చీపురుతో పాటు శరీరాన్ని కదిలిస్తూ వుంచాలి. దీని వల్ల కొంత వరకు వెన్ను మీద భారం పడకుండా వుంటుంది.

**ఇల్లు తుడవడం :** ఇల్లు ఊడ్చేటప్పుడు నడుము మీద ఎంత భారం పడుతుందో ఇల్లు తుడిచేటప్పుడు అంతకన్నా ఎక్కువ భారం పడుతుంది. ఇలాంటప్పుడు నడుము పట్టేయడం,

నడుము నొప్పి ఎక్కువవటం జరుగుతుంది. వంగి కాకుండా మోకాళ్ళ మీద కూర్చొని తుడవడం అలవాటు చేసుకోవాలి. ఇలా చేయటం వల్ల నడుము మీద భారం తగ్గుతుంది. అవసరం అనుకుంటే మోకాళ్ళకు కట్టుకునే ప్యాడ్స్ మార్కెట్లో అందుబాటులో వుంటాయి.

**వంటింట్లో సింకులు** : వంటగదిలో సింక్ మీ ఎత్తుకు సరిపడే విధంగా వుండాలి. అదే విధంగా సింక్‌లోని టాప్ కూడా మరీ దూరంగా కాకుండా అందుబాటులో వుండేలా చూసుకోవాలి. ట్యాప్ దూరంగా వుంటే నడుము ఎక్కువగా వంచాలి. సింక్‌కి సరిపడా ఎత్తులో స్టూల్ వేసుకొని కూర్చొని గిన్నేలు శుభ్రం చేసుకుంటే మంచిది.

**నీళ్ళ బిందెలు మోయడం** : బరువైన వస్తువులను పైకి ఎత్తడం, కిందనుండి నీళ్ళ బిందెలు మోయడం వాంటి పనుల వల్ల కూడా నడుము నొప్పి వచ్చే అవకాశం వుంది. బరువైన వస్తువులను ఒక్కసారిగా పైకి ఎత్తకుండా, మోకాళ్ళ మీద వంగి వాటిని పైకి లేపాలి. దాని వల్ల నడుం మీద భారం పడకుండా వుంటుంది.

ముఖ్యంగా బరువు తగ్గడం, క్రమం తప్పకుండా వీపు, పొత్తికడుపు వ్యాయామాలు చేయటం వల్ల నడుము నొప్పి నుంచి ఉపశమనం కలుగుతుంది. ◆

# పూట కూళ్ళమ్మ

- డా॥ ఎ. వెంకట రమణ ప్రసాద్

పడమటి కావ్య కన్యకలకు శుల్కం చెల్లించి
భారతావనికి తెచ్చుకున్న మూల పదార్థాన్ని
మన పురాణేతిహాసాల చరిత్రపుటల్లో రంగరించిన మేధావికి
తారసిల్లిన మూలపుటమ్మే పూటకూళ్ళమ్మ.

ఆమె పులుపును ఉమ్మేసి
మధురమును తినిపించిన శబరి
మాతాకబళాన్ని
అధిక, సమ, అత్యల్ప భాగాలు చేసి
మాతృవివేచనతో పంచిన కుంతి
చల్లను అంబలిని వెల్లుల్లిని తిపిస్తాన్నీ
శ్రీనాథునికి వడ్డించిన విస్వస్త.
కారడవిలో వేడి అన్నం వడ్డించి
శివాజీకి రాజకీయాలు బోధించిన బామ్మ
పాదచారుల ఆకలికి ః
అలమటించిన పేదరాశి పెద్దమ్మ
డొక్కా సీతమ్మ
జిల్లెళ్ళమూడి అమ్మ
కాలానుగతిగా కాలుకులోనైన కాలంలోకూడా
విద్యాలయాలున్న నగరాల్లో
ఏ పూట కాపూటే తిండి సమస్య అవుతున్నపుడు
బకాయిలు పెడుతున్నా వాయిదాల్లో ఇస్తున్నా
రుచిరుచిగా వండి వడ్డిస్తూ
'మెస్సు'ల్లో పిల్లల ఆయుస్సును
పెంచుతున్న అన్నమయ తేజస్సు ఆమె
ఇలా అన్నార్తులకు జీవనధారల్ని
ప్రసాదించిన గంగా భాగీరథీ సమానురాలీ పూటకూళ్ళమ్మ
ముచ్చటగా తప్పటడుగులు వేసే రోజుల్లోనే
ఒక కునుష్టీముసలాడికి కట్టబెడుతున్నప్పుడు
పీటల మీదే పెళ్లి కొడుకు గుటుక్కుమంటే
'పుస్తె కట్టబడని విధవగా నిలబడిపోయిన నిర్భాగ్యురాలు పూటకూళ్ళమ్మ

కాలాంతర గమనంలో కలియుగ నికృష్టధర్మంగా
కుహనా గిరీశాల ఇంద్రేంద్రియాల బలహీనతకు
ఆహుతి అయిన అహల్య పూటకూళ్ళమ్మ
తేరగా అరువుభోజనం మెక్కడమేకాదు
సరుకులు తెమ్మని ఇచ్చిన డబ్బు కూడా
డాన్సింగ్ గరల్స్ క్రింద ఖర్చు పెట్టిన
దగాకోరుల దేహశుద్ధి కోసం
చీపురుకట్టపట్టిన స్వచ్ఛ మహిళ పూటకూళ్ళమ్మ
ఆమె నిష్కల్మష జీవితానికి
కారుణ్య దృష్టికి
మహాకవి సృష్టికి
అజరామరమైన నివాళులర్పిద్దాం. ◆

# ఉద్యమాల బాటలో

## అధిక ధరలకు నిరసనగా :

ఉల్లిపాయ, కందిపప్పు, బియ్యం ధరలు విపరీతంగా పెరిగిపోయి సామాన్య మానవుడు అతలాకుతలమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఉల్లిరేటు ఒక దశలో కెజి 80రూ॥లకు కందిపప్పు 215, చింతపండు 170రూ॥లకు చేరుకుంది. ఉల్లిపాయలు, కందిపప్పు




ప్రకాశం




విజయవాడ

వంటి 14 నిత్యావసర సరుకులను చౌకధరల దుకాణాల ద్వారా పంపిణీ చేయాలనే ప్రధాన డిమాండ్‌తో ఐద్వా ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లోనూ ఆందోళన కార్యక్రమాలు జరిగాయి. సివిల్ సప్లయ్ ఆఫీలు, ఎంఆర్ఒ ఆఫీసుల వద్ద ధర్నాలు 12 జిల్లాల్లో 44 కేంద్రాల్లో ధర్నాలు, అధిక ధరల ఉట్టి కొట్టడం, చర్చా వేదిక, దిష్టిబొమ్మ దగ్ధం వినూత్న పద్ధతుల్లో కార్యక్రమాలు జరిగాయి.

## రేషన్ షాపుల సర్వే

పేదరిక నిర్మూలన దినం సందర్భంగా ఐద్వా రాష్ట్ర కమిటీ పిలుపుపై రేషన్ సక్రమంగా అందక పేదవారు పడుతున్న ఇబ్బందులు పెరుగుతున్న నేపథ్యంలో రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లోను డిపోలవద్దకు వస్తున్న కార్డుదారుల నుండి వివరాలు



తూర్పుగోదావరి

సేకరించేందుకు ఐద్వా సర్వే నిర్వహించింది. నెలలో కొన్ని రోజులు మాత్రమే డిపోలు తెరిచి ఉంటున్నాయి, మెషిన్‌లో వస్తున్న టెక్నికల్ సమస్యల వల్ల వేలిముద్రలు మ్యాచ్ కాకపోవటంవల్ల రేషన్ అందకపోవటం, రోజు కూలీకి వెళ్ళే వారు కూలీడబ్బులు కూడా నష్టపోవలసి వస్తుందని సర్వేలో తేలింది. 135 డిపోలలో సర్వే జరిగి మొత్తంగా 38 సెంటర్లలో ధర్నాలు జరిగాయి.

## మద్యంపై

నివాస ప్రాంతాల వద్ద మద్యం షాపుల పెట్టడాన్ని వ్యతిరేకిస్తూ భీమవరంలో రెండు సెంటర్లలో నిరసన దీక్షలు చేపట్టారు. స్థానిక ప్రజానీకం దీనిపై స్పందించారు. ఈ దీక్షలు




పశ్చిమగోదావరి

20రోజులుపాటు సాగింది. ఇదే విషయమై విశాఖ రూరల్- 450మందితో ధర్నా, ప్రదర్శన జరిగింది. మద్యంవల్ల కుటుంబాలు ఏవిధంగా బాధలు పడుతున్నాయో ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్ళేందుకు విజయవాడలో 5రోజులపాటు 1,000మంది లో సర్వే జరిగింది. ఈ 1000 మందిలో 630మంది తాగుడు అలవాటు ఉంది. అక్టోబరు 2 గాంధీ జయంతి సందర్భంగా మద్యంపై తక్కెడలో మందు బాటిల్స్, డబ్బు పెట్టి వినూత్నంగా కార్యక్రమం జరిగింది. సర్వే జరిగిన పేటలో బహిరంగ విచారణ సభ జరిగింది.

### స్థానిక సమస్యలపై

విజయవాడ గవర్నమెంట్ హాస్పటల్ సమస్యలపై డివైఎఫ్ఐతో కలిసి 80 మందితో ధర్నా జరిగింది. దీనికి 20 మంది మహిళలు పాల్గొన్నారు. కర్నూలు ఆత్మకూరు డివిజన్ 36వ వార్డులో డ్రైనేజీ ప్రాబ్లమ్‌ను సాల్వ్ చేయాల్సిందిగా కమీషనర్‌కు, అడిషనల్ కమీనర్‌కు మెమోరాండం ఇవ్వటం జరిగింది. తూర్పు గోదావరి-వృద్ధాప్య పెన్షన్స్ కొరకు




కమిషనర్‌కు, మధ్యాహ్న భోజన పెండింగ్ బిల్స్ కొరకు సబ్ కలెక్టర్‌కి మెమోరాండం ఇచ్చారు. విజయనగరంలో అక్టోబరు 30న రైతుబజారు ఏర్పాటు చేయాలని ధర్నాచేయటం, ఏర్పాటుకు సానుకూలత లభించింది.

### హింస పై




నాగాయలంక మండలం బర్రంకుల గ్రామంలో జరిగిన వరలక్ష్మి హత్య కేసు వెలికి తీయడంలో ఐద్వా చురుకైన పాత్ర వహించింది. కలెక్టర్ గారికి, మహిళా కమిషన్ చైర్‌పర్సన్ త్రిపురాన వెంకటరత్నం గార్లకు మెమొరాండం ఇవ్వడమైనది. పశ్చిమ గోదావరి జిల్లాలో జరిగిన 2 అత్యాచార ఘటనలకు నిరసనగా ధర్నాలు జరిగాయి.

498 (ఎ) క్రింద కేసులను నమోదు చేయాలని, నిందితులను అరెస్టు చేయాలని కోరుతూ విజయవాడలో ఐక్యవేదిక ఆధ్వర్యంలో ధర్నా జరిగింది. కమీషనరు మహిళా సంఘాలతో ప్రత్యేక సమావేశం నిర్వహించారు. విజయవాడలో







రౌండ్-టేబుల్ సమావేశం జరిగింది.

-నారాయణ కాలేజి విద్యార్థుల మరణానికి సంతాపం ప్రకటిస్తూ ఎస్.ఎఫ్.ఐతో కొవ్వొత్తులతో ర్యాలీ 50 మందితో జరిగింది. డివైఎఫ్ఐ, ఎస్ఎఫ్ఐ ఐద్వా ఆధ్వర్యంలో రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది.

-ఉత్తరప్రదేశ్‌లో దళిత మహిళలపై జరిగిన దాడిని నిరశిస్తూ కెవిపిఎస్‌తో కలిసి లెనిన్ సెంటరులో దిష్టిబొమ్మ దగ్ధం 80 మందితో జరిగింది

### డా॥ టాన్యా వర్ధంతి సభ :

డా॥ మోటూరు టాన్యా వర్ధంతి సభ ఒంగోలులో 70మందితో జరిగింది. ఈ సందర్భంగా ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించడమైనది. అధిక సంఖ్యలో ప్రజలు చికిత్స పొందారు. మందుల పంపిణీ జరిగింది. నలుగురు వైద్యులు సేవలందించారు.






విజయవాడలో ఉదయం గారి జయంతి కార్యక్రమంలో 41 మంది పాల్గొన్నారు. ఈ సందర్భంగా మోటూరి ఉదయం మహిళా కుట్టు సెంటర్‌ను ప్రారంభించారు.

**సెమినార్స్:**

మహిళలకు ఎదుర్కొనే ఆరోగ్య సమస్యలపై వారు తీసుకోవలసిన జాగ్రత్తలు, ప్రాథమిక చికిత్స తదితర విషయాలలో వారికి అవేర్‌నెస్ కల్పించేందుకు విజయవాడనగరంలో డా॥ సుమిత్ర గారిచే ముఖాముఖి కార్యక్రమం జరిగింది. మహిళలు తాము రోజువారీ ఎదుర్కొంటున్న సమస్యలను చెప్పటంతో తీసుకోలసిన జాగ్రత్తలు డాక్టరు గారు వివరించారు.

విజయవాడలో ప్రభుత్వ విద్యను ప్రోత్సహించడం ద్వారా "మహిళా విద్యను రక్షించుకుందాం" అనే అంశంపై కాలేజీలో జరిగిన సెమినార్‌లలో 300మంది విద్యార్థులు పాల్గొన్నారు.

## కల్తీ మద్యం ఘటన

విజయవాడలోని కృష్ణలంకలో స్వర్ణబార్‌లో కల్తీ మద్యం సేవించి ఐదుగురు మరణించారు. వీరంతా పేద కుటుంబాలకు చెందినవారే. ఈ ఘటనపై ఐద్వా వెంటనే స్పందించి ప్రభుత్వ ఆసుపత్రి వద్ద నిరసన కార్యక్రమం చేసింది. మరో 20 మంది వరకు తీవ్ర అస్వస్థతతో ఆసుపత్రిలో చేరారు. దోషులను వెంటనే అరెస్టు చేయాలని, కఠిన చర్యలు తీసుకోవాలని, బాధిత కుటుంబాలకు 10 లక్షల ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలని ఎక్సైజ్ పాలసీని మార్చాలని మద్య నియంత్రణకు ప్రభుత్వం చర్యలు చేపట్టాలని ప్రధాన డిమాండ్స్‌తో ముఖ్యమంత్రి బాధితులను పరామర్శించిన సందర్భంగా ఘెరావ్ చేయడం జరిగింది. ఈ సందర్భంగా అన్ని మహిళా ప్రజా సంఘాలతోటి రౌండ్‌టేబుల్ సమావేశం నిర్వహించి దీనిపై కొనసాగింపు కార్యక్రమం చేపట్టేందుకు కార్యచరణ తీసుకోవటం జరిగింది.




## పిడింగొయ్యి ఘటన




తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి రూరల్ పిడింగొయ్య గ్రామంలో కులాంతర వివాహం చేసుకున్న నేపథ్యంలోనూ, భూ సమస్యతోనూ సాంఘిక బహిష్కారం జరిగిన నేపథ్యంలో ఆ గ్రామాన్ని సందర్శించి మహిళా కమీషన్‌కు మెమోరాండం ఇచ్చాము. పిడింగొయ్యి గ్రామంలో పెత్తందార్లు దళిత కాలనీలో ఉన్న అంబేద్కర్ విగ్రహాన్ని కూలగొట్టి వారిపై దాడికి దిగారు. ఈ ఘటనతో గ్రామంలో ఉద్రిక్త పరిస్థితి నెలకొంది. కొంతమందిని గ్రామం నుంచి బహిష్కరించారు. ఈ ఘటనపై తీవ్రంగా స్పందించిన ప్రజానీకం రిలే నిరాహార దీక్షలను చేపట్టారు. వారికి ఐద్వా తూర్పుగోదావరి జిల్లా కమిటీ మద్దతు తెలియజేసింది.




కాల్‌మని వ్యాపారులను కఠినంగా శిక్షించాలని విజయవాడలో ధర్నా




సిద్దార్థ కాలేజీ - విజయవాడ




పశ్చిమగోదావరి




విశాఖ సిటి



తిరుపతి




విజయనగరం




కథల పోటీ విజేతకు బహుమతి ప్రదానం



గుంటూరు



గుంటూరు

CMV01A149






వక్తృత్వ పోటీల విజేతలకు బహుమతి - అనంతపురం



దేశభక్తి గీతాలాపన



దిద్దుబాటు నాటిక ప్రదర్శన - విశాఖ




తిరుపతి




విజయనగరం




కర్నూలు



*Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Kalpana Prints Road, Krishna Lanka, Vijayawada. Ph. 9490098620, Printed at Prajasakti Daily Printing Press, Krishna Nagar, Tadepalli (M) Guntur Dt. Editor : D. Rama Devi*



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A149 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |